# సోవియట్ సమీక్ష

మిహయిల్ గోర్బచేవ్ భారతదేశ సందర్శన

అహింసా భావన : ఒక నూతన దృక్పథం

పెరిస్త్రోయికా భవితవ్యం




సోవియట్, భారత ఉత్సవాల సానుకూల ఫలితాలు



## సంబంధాలు

యు.ఎస్.ఏ. టుడే వార్తాపత్రిక ప్రెసిడెంట్ జాన్ క్విన్, యు.ఎస్.ఏ. టుడే పబ్లిషర్స్ ప్రెసిడెంట్ డేవిడ్ మజారెల్లా, గానెట్ కార్పొరేషన్ చైర్మన్ అల్లాన్ నెయుహారాత్(వరుసగా ఎడమ నుండి కుడివైపు)లతో ముచ్చటిస్తున్న సోవియట్ విదేశాంగ మంత్రి ఎడ్వార్డ్ షెవర్డ్‌నాడ్జే (కుడినుండి రెండవ వారు) మాస్కో, 1988.

భారతదేశ టెలివిజన్ డిప్యూటీ డైరెక్టర్ జనరల్ ఎ.ఎస్. అగర్వాల్, ఉజ్బెక్ పెయింటర్ రుజీభారియెవ్. 1988

భారతదేశ మానవ వనరుల అభివృద్ధి మంత్రి నరసింహారావు (కుడినుండి రెండవవారు) మాస్కోలోని పుష్కిన్ వీధిలో

“మన దక్షిణాదినగల మహత్తర
పొరుగు దేశ శాంతి విధానాన్ని
సోవియట్ యూనియన్‌లోని
మనం యెంతో గౌరవప్రదంగా
చూసుకుంటున్నాం. అలీన
వుద్యమంలో, ఆరురాజ్యాల
చొరవలో గొప్ప పాత్ర నిర్వహిస్తున్న
భారతదేశం సమైక్యంగా,
సుదృఢంగా, స్వతంత్రంగా కొన
సాగాలని మన ఆకాంక్ష. యిలాంటి
భారతదేశం శాంతికి, ఆసియా,
మొత్తం ప్రపంచ భద్రతకు
స్థిరమైన, అవశ్యకమైన కారకం.

మిహాయిల్ గొర్బచేవ్


# సోవియట్ సమీక్ష

12

సంపుటి 22

డిసెంబర్
1988

సంపాదకుడు :
వి. ఎఫ్. ష్కల్యాబిన్

సంయుక్త సంపాదకుడు :
జి. ఆళవందార్

సహాయ సంపాదకుడు
మునగాల జనార్దన రెడ్డి

ఆర్టిస్ట్
వి.ఒ. అదామొవిచ్

పుటల రూపరచన
వి. పల్యాకవ్

11 భారతీయ భాషల్లో వెలువడే పత్రిక

SOVIET SAMEEKSHA - (Telugu)

ఈ సంచికలోని చిత్రాలు, వ్యాసాలు
నొవొస్తి వార్తా సంస్థవి

Printed by S. G. Dychev and Published by him at Soviet Nadu Office, 115, Theagaraya Road– Madras-600 017, (Phone:440201), for the Information Department of the USSR Embassy in India. Printed at Pavai Printers (P) Ltd., 142, Jani Jan Khan Road, Madras-600014.


1

# ఈ సంచికలో







2

# మిహయిల్ గొర్బచేవ్ భారతదేశ సందర్శన



4
విమానాశ్రయంలో మిహాయిల్ గొర్బచేవ్, రైసాగొర్బచేవాలకు శ్రీరాజీవ్‌గాంధి శ్రీమతి సోనియా గాంధి హృదయపూర్వక స్వాగతంపలికారు.

## 52 సోవియట్, భారతవుత్సవాల సానుకూల ఫలితాలు





# అధ్యక్షులు మిహయీల్ గొర్బచేవ్ భారతదేశ సందర్శన



యుఎస్.ఎస్.ఆర్ సుప్రీం సోవియట్ అధ్యక్షులు, సి సి ఎస్ యు కేంద్రకమిటీ ప్రధానకార్యదర్శి మిహయీల్ గొర్బచేవ్ భారత నాయకత్వం ఆహ్వానంపై మూడురోజుల పర్యటనకై ఢిల్లీ విచ్చేశారు. విమానాశ్రయంనుంచి రాష్ట్రపతి భవన్ వరకు దారి పొడువునా పూల ఆర్చీలు, బ్యానర్‌లు, ఉభయ దేశాల పతాకాలతో మిహయీల్ గొర్బచేవ్, రైసా గొర్బచేవాల ఫొటోలతో అందంగా అలంకరించారు. శాంతి, మైత్రి దూతగా సోవియట్ నేతను ఎంతగా భారత ప్రజలు గౌరవిస్తున్నదీ యిది ప్రతి బింబించింది.

ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధి, ఆయన సతీమణి శ్రీమతి సోనియాగాంధి ప్రభృతులు మిహయీల్ గొర్బచేవ్ రైసాగొర్బచేవాలకు హృదయపూర్వక స్వాగతం పలికారు.

సోవియట్ అధ్యక్షులు, ఆయనతోబాటు విచ్చేసిన యితర ప్రతినిధి వర్గ సభ్యులు రాష్ట్రపతి భవన్‌కు బయల్దేరారు. దారిపొడు గునా ఉత్సాహ పూరితంగా పాఠశాల విద్యార్థులు, ప్రజలు రెండు దేశాల పతాకాలను వూపుతూ స్వాగతం పలికారు. దేశభక్తి గీతాలనాలపించారు. సోవియట్‌నేతను, భారత సోవియట్ మైత్రిని, ప్రపంచ శాంతిని కాంక్షిస్తూ నినాదాలు చేశారు.

రాష్ట్రపతిభవన్ వద్ద సోవియట్ అధ్యక్షునికి ఆయన సతీమణికి అధికార స్వాగతంగా 21 ఫిరంగులను పేల్చి గౌరవవందనం సమర్పించారు. రాష్ట్రపతి శ్రీ ఆర్.వెంకట్రామన్, ఆయన సతీమణి శ్రీమతి జానకివెంకట్రామన్‌లు గొర్బచేవ్‌కు సాదరంగా స్వాగతం పలికారు. భారత

దేశపు త్రివిధ దళాలు సమర్పించిన గౌరవసైనిక వందనాన్ని మిహాయిల్ గోర్బచేవ్ పర్య వేక్షిం చారు. అనంతరం మిహాయిల్ గోర్బచేవ్ రాష్ట్ర పతి శ్రీ ఆర్ వెంకట్రామన్‌ను కలుసుకున్నారు. సుహృద్భావ పూర్వక మైత్రీ సంభాషణలు జరిపారు. అదేరోజున ఉపరాష్ట్రపతి డా. శంకర్‌దయాళ్‌శర్మ సోవియట్ అధ్యక్షుని కలుసుకున్నారు.

అదేరోజున గోర్బచేవ్ భారతప్రధాని శ్రీరాజీవ్ గాంధీతో రాష్ట్రపతిభవన్‌లో సమావేశం జరిపారు. వారిరువురి మధ్య విస్తృతంగా సంభాషణలు జరిగాయి. ముఖ్యపరిణామాలపై అభిప్రాయాలు తెలుపుకున్నారు. సోవియట్ ఆర్థికవ్యవస్థకు విలక్ష ణంగా జరుగుతున్న పునర్వ్యవస్థీకరణ క్రమం పెరిస్త్రోయికా తదితర అంశాలు వారు చర్చిం చారు. ఉభయదేశాల ప్రయోజనాలకు, మరింత మెరుగైన ప్రపంచ నిర్మాణానికి దోహద పడే నిమిత్తం భారత, సోవియట్ మైత్రీ సహకారాలను మరింత ముందుకు తీసుకుపోయే అవకాశాలను గురించి వారు చర్చించారు. అంతర్జాతీయ సమస్యలు కూడా వారు చర్చించారు.

గౌరవ అతిథుల గౌరవార్థం ఆ సాయంత్రం రాష్ట్రపతి శ్రీ ఆర్ వెంకట్రామన్ విందునిచ్చారు.

రాజ్యాల మధ్య సంబంధాలలో అసాధారణ మైనవిధంగా లోతైన చిత్తశుద్ధి, విశాలమైన విస్తృతీ భారత, సోవియట్ సంబంధాలకు వున్నాయని సోవియట్ నేతకు స్వాగతం పలుకుతూ శ్రీ వెంక ట్రామన్ ఉద్ఘాటించారు. భారత సోవియట్ యూని యన్‌ల సంబంధాలు ఒక గుణాత్మకమైన సుసంప న్నతను, యింతకు ముందు కనీవినీ ఎరుగని కొత్తదైన జీవ శక్తినీ, ప్రగాఢతనూ, పరిపక్వతనూ సంతరించుకున్నాయని ఆయన పేర్కొన్నారు.

భారత దేశంలో తన పర్యటన సోవియట్ భారత సంబంధాలను మరింత దృఢతరంచేసి అభివృద్ధి పర్చే దిశగా కృషిలో మరో ముందడుగు అని మిహాయిల్ గోర్బచేవ్ తన సమాధానంలో అభి భాషించారు. ''మానవాళి తన అభివృద్ధిలో ఒక విభజన రేఖవద్ద నిల్చి వున్న యీ సమయంలో, సంఘర్షణలను అంతమొందించేందుకు ప్రపంచ వ్యవహారాలలో మెరుగుదల దిశగా ఒక సమూ లమలుపు సాధించేందుకు కృషి చేస్తున్నవారిలో సోవియట్ యూనియన్ భారతదేశం వుండటం ఎంతో ముఖ్య మైన విషయం'' అని సోవియట్ నేత ఉద్ఘాటించారు.

''ఢిల్లీ ప్రకటన అనంతరం గత రెండేళ్ళ కాలంలో ప్రపంచంలో అటు పెద్దమార్పుల్నీ ఇటు అంతర్జాతీయ వ్యవహారాలలో నిమగ్న మైనవారు ఆ మార్పుల్ని పరిగణనలోకి తీసుకొనడానికి నిర్మా ణాత్మకనిర్ధారణలు చేయడానికీ సుముఖులుగా వుండటం పెరగడాన్ని మనం చూశాం. మన కాలపు స్ఫూర్తిని యీ ప్రకటన సక్రమంగా అవ గాహన పర్చుకుందనీ, దానిలోని భావాలు కేవల ఆకాంక్షలకు మించిన విషయాలనీ కూడా యిది మీకూ మాకూ స్పష్టం చేస్తున్నది'' అని ఆయన చెప్పారు. యీ సానుకూలమైన కొత్త సరళులు తిరుగు లేనివిగా వుండేట్టు చూసేందుకు చేయ గల్గిన దంతా చేయడం యిప్పుడు చాలా ముఖ్యం అని ఆయన పేర్కొన్నారు

''ఇప్పటికి మూడు దశాబ్దాలకు పైగా శిఖరాగ్ర స్థాయిలో నిర్మాణాత్మక సంభాషణలు సోవియట్, భారత సంబంధాలకు చోదక శక్తిగా వుంటున్నాయి. ఇటీవలి సంవత్స రాలలో ఈ సంభాషణ ఒక కొత్త గుణాత్మకతనూ, అంతర్జాతీయ పరమైన దానితో సహా ప్రత్యేక మైన ప్రాముఖ్యతనూ సంతరించు కుంది'' అని ఆయన నొక్కి చెప్పారు.

రెండు దేశాల మధ్యా మైత్రీ అవగాహనా సంపదను పెంచుకొనేందుకు, తమ బహుముఖ సహ కారాన్ని దృఢతర మొనర్చుకు నేందుకు, ప్రపంచ రాజకీయా లలో తమ సహకారాన్ని ప్రగాఢ మొనర్చు కొనేందుకు తగువిధంగా కృషి చేసేందుకు సంసి ద్ధతను రెండు పక్షాలు వ్యక్తపరిచాయి.

ప్రపంచ కుటుంబానికి ఆందోళన కల్గిస్తున్న కొన్ని అంతర్జాతీయ సమస్యలపైనా, ప్రాంతీయ ఘర్షణలపైనా వారు లోతుగా తమ అభిప్రాయాలు పరస్పరం తెలుపుకున్నారు.

నవంబరు 19 వ తేదీ ఉదయం మిహాయిల్ గోర్బచేవ్ తన సతీమణి రైసాగోర్బచేవాతో సహా రాజ్‌ఘాట్‌ను సందర్శించి మహాత్మా గాంధి సమాధిముందు పుష్ప గుచ్ఛాన్నుంచి శ్రద్ధాంజలి ఘటించారు. భారతదేశంలో యింతకు ముందు తాను పర్యటించిన సమయంలో నాటిన మొక్కను ఆయన చూశారు.

జవహర్లాల్ నెహ్రూ సమాధి శాంతివనాన్ని, ఇందిరాగాంధి సమాధి శక్తిస్థల్‌ను ఆయన సంద ర్శించి పుష్పాంజలి ఘటించారు. ఈ రెండు సమాధుల వద్దా ఆయన మొక్కలను నాటారు.

నవంబరు 19 న న్యూఢిల్లీ లోని విజ్ఞాన భవన్‌లో జరిగిన ఒక గంభీరమైన వుత్సవంలో



శాంతి, అభివృద్ధి, సహకారానికి 1987 ఇందిరాగాంధి బహుమతిని రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకటరామన్ నుంచి మిహాయిల్ గొర్బచేవ్ స్వీకరిస్తున్న దృశ్యం.

1987 ,వ సంవత్సరానికి ఇందిరాగాంధి స్మారక ప్రతిష్ఠాకర బహుమతిని మిహయిఽల్ గొర్బచేవ్ కు రాష్ట్రపతి శ్రీ ఆర్.వెంకట్రామన్ అందజేశారు. అణ్వాస్త్ర విసర్జనకుగాను సానుకూల మైన శక్తివంత మైన క్రమాన్ని అభివృద్ధి పరిచేందుకు సాహసోపేతంగా, అందరి మనసులను ఆకట్టుకునే విధంగా ప్రతిపాదనలు చేసినందుకూ, అణ్వాస్త్రరహిత, హింసారహిత ప్రపంచ స్థాపనదిశగా చేసిన కృషికీ యీ సన్మానాన్ని మిహాయిల్ గొర్బచేవ్‌కు అందిస్తున్నట్టు న్యాయనిర్ణేతల సంఘం ప్రశంసాపత్రంలో పేర్కొంది.

సమానత, పరస్పర అవగాహన విశ్వాసం ప్రాతిపదికగా సన్నిహిత సహకారం నెరుపుతూ కృషి చేస్తున్న రెండు భిన్న సామాజికార్థిక వ్యవస్థల శాంతియుత సహజీవనానికి భారత సోవియట్ మైత్రి అత్యుత్తమ మైన ఆదర్శం అని బహుమతిగ్రహీత అయిన సోవియట్ నేతను అభినందిస్తూ చేసిన ప్రసంగంలో భారతప్రధాని శ్రీ రాజీవ్‌గాంధి చెప్పారు. యీ మైత్రి ఎవరికీ ఎలాటిహానీ కల్గించ లేదు. మిలియన్లాది ప్రజలకు లాభంచేకూర్చింది అని ఆయన నొక్కి చెప్పారు.

ఈ ద్వీపక్ష సంబంధాన్ని ఢిల్లీప్రకటన విస్తృత మైన ప్రపంచ స్థాయిలో వుంచింది. భారతదేశం, సోవియట్ యూనియన్ కలిసి కృషిచేశాయి, కొత్త ప్రపంచాన్ని, జాతి దురహంకారవాదం, వలస వాదం, అణ్వాస్త్రాల బెదురు చూపడం వుండని ప్రపంచాన్ని నిర్మించేందుకు యీ కృషిని ముందుకు కొనసాగించాలని భారతదేశం ఆకాంక్షిస్తున్నది.

భారత ఉపరాష్ట్రపతి, ఇందిరాగాంధీ స్మారక నిధి అంతర్జాతీయ న్యాయనిర్ణేతల సంఘం అధ్యక్షులూ అయిన డా.శంకర దయాళ్ శర్మయిలా అన్నారు: "కొద్ది కాలం క్రితం వరకూ కూడ అపనమ్మకం, ద్వేషం అంతర్జాతీయ రంగంలో ఎంతగా పైచేయి పొందిందీ అంటే, వినాశనం తప్పించడం సాధ్యం కాదేమో అన్నట్టు కనిపించింది. అయితే ఆశాకిరణం పొడుచుకు ముందుకొచ్చింది శాంతికి ఒకకొత్త అవకాశం చిక్కింది. ఈ మార్పు కోసం అధ్యక్షులు గొర్బచేవ్ వ్యక్తిగతంగా దోహదం చేకూ ర్చారు అది కీలకమైన దోహదం".

రాష్ట్రపతి ఆర్.వెంకట్రామన్ యీ బహు మతిని

మిహాయిల్ గొర్బచేవ్‌కు అందజేస్తూ మరింత విజ్ఞతాయుతమైన, సురక్షితమైన ప్రపంచంకోసం సోవియట్ నాయకుడు చేసిన చరిత్రాత్మక కృషికి యిది సముచితమైన గుర్తింపు అని పేర్కొన్నారు. మిహాయిల్ గొర్బచేవ్ కనబర్చిన సాహసాన్నీ ఘర్షణ, హింసల అయోమయ స్థితినుంచీ ప్రపంచానికి భావాల చర్యల మార్గ సముదాయాన్ని చూపగలిగిన ఆయన దృక్పథాన్ని రాష్ట్రపతి కొనియాడారు. "మీరు చేసిన ప్రయత్నం దౌత్య నీతిని మించి రాజనీతిజ్ఞత వరకూ, రాజకీ యాలను మించి తత్వశాస్త్రం వరకూ వెళ్తూంది" అని ఆయన అన్నారు.

"అణ్వస్త్రరహిత, హింసారహిత ప్రపంచ సూత్రాల గురించిన చరిత్రాత్మకమైన ఢిల్లీ ప్రకటనలో మానవాళి భవితవ్యాన్ని మూర్తీభవించినట్టి మీ దృక్పథంతో భారతదేశంలోని మేము యేకీభవిస్తున్నాం"

తనకిచ్చిన గౌరవ సత్కారానికి కృతజ్ఞతలు తెల్పుతూ మిహాయిల్ గొర్బచేవ్ యిలా అన్నారు: "యీ శతాబ్దంలో సాటిలేని మహిళ, అసాధారణ రాజనీతిజ్ఞురాలు, ప్రపంచస్థాయి మేధాశక్తిగల రాజకీయ నాయకురాలు అయిన ఇందిరాగాంధీ వారసత్వం ప్రధానంగా భారత దేశానికి చెందినది. కానీ ఇందిరాగాంధీ మానవాళికంతటికీ ప్రీతిపాత్రమైన వ్యక్తి. ఆమె తమ దేశ భవిత్వమూ, ప్రపంచ ప్రగతీ వేరువేరని భావించలేదు.

"ప్రపంచాభివృద్ధికి ప్రత్యామ్నాయ మార్గాలు బాగా పెరుగుతున్నట్టు, ఒక నూతన ప్రపంచానికి రూపుదిద్దడంలో ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలు చేస్తున్న దోహదం నానాటికీ పెరుగుతున్నట్టు సోవియట్ యూనియన్‌లోని మేము భావిస్తున్నాం... దీన్ని వ్యాఖ్యానించి అమలు జరపడంలో ఐక్య రాజ్య సమితి ప్రముఖపాత్ర నిర్వహించాల్సి వుందని నేను విశ్వసిస్తున్నాను.

"ఆఫ్ఘనిస్తాన్ గురించిన జెనీవా ఒప్పందాలు నెరపిన సానుకూల ప్రభావాన్ని సంబంధిత పక్షాలేగాక, యావత్ప్రపంచం గుర్తించింది. యీ విషయాన్ని యీనెల ప్రారంభంలో జరిగిన ఐ.రా.స సర్వప్రతినిధి సభ 'ఆఫ్ఘనిస్తాన్ పరిస్థితీ, దాని మూలంగా అంతర్జాతీయ శాంతి భద్రతలకు చిక్కులు అనే అర్థవంతమైన శీర్షికతో ఒక తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించింది కానీ, అంతర్జాతీయ వ్యవహారాలపట్ల నూతన ధోరణిని అంగీకరించడానికి పాకిస్తాన్, అమెరికాలకు మన సొప్పడం లేదనిపిస్తోంది.

"అంతర్జాతీయ భద్రతను, పద్ధతులను, అలాగే దాన్నీ ఆసియానూ, మొత్తం ఆసియాపసిఫిక్ ప్రాంత భద్రత, పద్ధతులను పటిష్టం చేయడం గురించిన విషయం మా ఆలోచనలో సహజంగానే ప్రముఖస్థానం వహిస్తోంది. మేము ప్రత్యేకించి భారతదేశ అవగాహన, సహకారాల మీద ఆశలు పెట్టుకున్నాం; యివి లేకుండా ఆసియా-పసిఫిక్ ప్రాంతంలోని సమస్యలు యెన్నటికీ పరిష్కారం కాజాలవు" అని ఆయన అన్నారు.

"సోవియట్ యూనియన్, భారత దేశం, చైనా లలాంటి దేశాలను గురించి ఆలోచిస్తున్నప్పుడు, ఆసియా భవితవ్యానికీ, ప్రపంచప్రగతికీ వాటి మధ్య సత్సంబంధాలు అత్యంత ముఖ్యమైన విషయమని యెవరైనా తప్పక అర్థం చేసుకుంటారు." భారతదేశం, చైనాల మధ్యగల సంబంధాలు మెరుగు పడ్తున్న సూచనలు కనిపించడంతో సోవియట్ యూనియన్ సంతోషిస్తున్నట్లు సోవియట్ అధ్యక్షుడు చెప్పారు. "చైనా పట్ల మా సంబంధాలు కూడా ప్రోత్సాహకరంగా పరిణమిస్తున్నాయి" అని ఆయన పేర్కొన్నారు.

అపనమ్మకానికి ప్రత్యామ్నాయంగాని విధంగా వుభయ దేశాల మధ్య నమ్మకం యేర్పడ్డమనేది మహత్తర ప్రాముఖ్యంగల విషయమని సోవియట్-భారత సంబంధాలను గురించి ప్రస్తావిస్తూ మిహాయిల్ గొర్బచేవ్ అన్నారు. "రెండు మహత్తరదేశాలు విశ్వాస ప్రాతిపదికపై తమసొంత ప్రయోజనం కోసం, యితరులపట్ల దురభిమానానికి తావు లేకుండా కలిసికట్టుగా యెలా పనిచేయవచ్చో యీనాడు మనం యావత్ప్రపంచానికీ తెలియజెప్తున్నాం. మన సంబంధాల సంప్రదాయాలు ఫలప్రద మైనవి, అవకాశాలు అధికం, భవిష్యత్తు మన చేతుల్లోనే వుంది" అన్నారాయన.

ఇందిరాగాంధీ శాంతి బహుమతిగా మిహాయిల్ గొర్బచేవ్‌కు నగదు రూపంలో ప్రకటించిన మొత్తం న్యూఢిల్లీలోని సోవియట్ శాస్త్ర, సాంస్కృతిక, కళామందిరానికి వెళ్తుందనీ, ప్రపంచ శాంతి విషయంలో వుభయదేశాల మధ్యగల సాంప్రదాయిక స్నేహ సహకారాలను మరింత పటిష్టం చేసేందుకు, ఆ విధంగా యీ బహుమతి వుపయోగ పడ్తుందనీ మిహాయిల్ గొర్బచేవ్ ఆదేశాల మేరకు సోవియట్ విదేశాంగ మంత్రి ఎద్వార్డ్ నాడ్జె ప్రకటించారు:

నవంబర్ 19 న సోవియట్ అధ్యక్షుడు భారత ప్రధాని రాజీవ్ గాంధీతో మరో విడత చర్చలు జరిపారు. ప్రత్యేకించి, సోవియట్ యూనియన్ తన 13 వ పంచవర్ష ప్రణాళికను, భారతదేశం తన 8 వ ప్రణాళికను రూపొందిస్తున్నాయి కాబట్టి, ఆర్థిక సంబంధాల విషయంలో బాగా సహకరించు కోవాల్సిన, సంభాషణను ముమ్మరం చేయాల్సిన అవసరమున్నట్టు వుభయదేశాల నాయకులూ యీ సమావేశం సందర్భంగా పేర్కొన్నారు.

సాయంత్రం న్యూఢిల్లీలోని ఇందిరాగాంధీ స్టేడి యంలో, భారతదేశంలో జరుగుతున్న సోవియట్ యూనియన్ వుత్సవం ముగింపు సమావేశంలో సోవియట్ యూనియన్ అధ్య క్షుడు, భారత రాష్ట్రపతి పాల్గొన్నారు. యీ సమావేశానికి వుప రాష్ట్రపతి డాక్టర్. ఎస్.డి. శర్మ ప్రధాని రాజీవ్‌గాంధీ కూడా హాజరయ్యారు.

''ప్రజల దౌత్యనీతి వారధిగా సహకా రానికిగల అమూల్య పాత్రను గురించి నొక్కి చెప్తూ,'' యీ వుత్సవాలు ''భారత-సోవియట్ మైత్రీ చరిత్రలో నూతన అధ్యాయాన్ని ఆవిష్క రించాయి'' అని యీ సందర్భంగా ప్రసం గిస్తూ రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకటరామన్ పేర్కొన్నారు.

మానవకుటుంబ ఐక్యతా భావనను విభిన్న దేశాలకు చెందిన ప్రజల మధ్య గల విస్తృత సంబంధాలను పటిష్టం చేస్తున్నట్టు యీ వుత్స వాలు రుజువు చేశాయని మిహాయిల్ గోర్బచేవ్ తన ప్రసంగంలో చెప్పారు. "విశ్వాసం, పరస్ప రావ గాహన, జీవనసరళిని యెంచుకోడానికి ప్రతి ఒక్కరికీ సార్వభౌమాధికార హక్కును గౌరవించే ప్రాతిపదికపై సహకారానికి సంసిద్ధత-యివి సమగ్ర రాజకీయ భద్ర తను పెంపొందించడానికి తోడ్పడతాయనీ, తద్వారా ఆత్మవినాశం నుంచీ అందమైన మన భూగోళాన్ని రక్షిస్తాయి'' అని ఆయన అన్నారు.

ఈ వుత్సవాలు 20 వ శతాబ్దంలోని అత్యంత ముఖ్యమైన ఘట్టాలతో - అక్టోబర్ సోషలిస్టు విప్లవ 70 వ వార్షికోత్సవంతో, భారతదేశ స్వాతంత్ర్య 40 వ వార్షికోత్సవంతో ముడివడి వున్నాయనీ, సోవియట్ అధ్యక్షుడు అన్నారు.

''భారతదేశ మహత్తర పుత్రుడైన జవహర్‌లాల్ నెహ్రూ శతజయంత్యుత్సవం యేడాది పాటు జరగ బోతున్న సందర్భంగా యీ వుత్స వాలు దివిటీని అందించడం కూడా చాలా ముఖ్యమైన విషయం..... నెహ్రూ శతజయంతి వుత్సవంలో మేము పాల్గొంటాము'' అని ఆయన పేర్కొన్నారు.

ముగింపులో, సోవియట్ ప్రజల తరపున భార తీయులకు సోవియట్ అధ్య క్షుడు శాంతి, ప్రశాంతత, ప్రగతి, దేశ ఐక్యతను పటిష్టం చేయ డంలో విజయం, సరిహద్దుల అనుల్లంఘనీయత ఆకాంక్షించారు. ''వుభయదేశాల మహత్తర ప్రజల మధ్య యీ మైత్రీ వుత్సవం మన మైత్రీ చిహ్నంగా మన జ్ఞాపకాల్లో పదిలంగా వుండిపోతుంది; మరింత మంచి ప్రపంచం దిశగా సంయుక్త వుద్యమానికి ప్రేరణనిస్తుంది'' అని ఆయన అన్నారు.

నవంబర్ 20 వుదయం, రాష్ట్ర పతిభవన్‌లో మిహాయిల్ గోర్బచేవ్, ప్రధాని రాజీవ్‌గాంధీల మధ్య మూడో సమావేశం జరిగింది. సోవియట్ యూనియన్, భారతదేశాల మధ్య శాస్త్ర, సాంకేతిక సంబంధాలపరమైన కీలకాంశాలపై, ఆదానప్రదా నాలపై చర్చలో దృష్టి కేంద్రీ కరించడం జరిగింది. పర్యటన సందర్భంగా యేర్పడిన అవగాహనలను, కుదిరిన ఒప్పందాలను అమలు జరపడానికి సంబంధించిన నిర్దిష్ట సమస్యలను వుభయపక్షాలు చర్చించాయి. అన్ని దిశల్లో ప్రగాఢమౌతున్న సహకా రానికి వుభయపక్షాల తరపున సిబ్బంది తోడ్పాటు, ప్రతిపాదనలను విశదీకరించే కృషివేపు క్రమబద్ధ ప్రాతిపదికపై శాస్త్రవేత్తలను ఆకర్షించడం, సోవియట్ భారత సంబంధాలను మెరుగుపర్చ డం - వారు యీ అంశాన్ని గురించి చర్చలో ప్రస్తావించారు.

ప్రపంచంలోని విభిన్న ప్రాంతాల పరిస్థితిని గురించి, ప్రాంతీయ ఘర్షణలను అంతంచేసే అవకాశాలను గురించి, వారు పరస్పరం అభి ప్రాయాలు తెలియ జేసుకున్నారు.

చర్చలు మునుపటిలాగే ఒండొరుల ప్రగాఢ విశ్వాసపూరిత వాతావరణంలో, పరస్పరావగాహనతో, వుభయదేశాల ప్రజల ప్రయోజనంకోసం, శాంతీ ప్రగతుల కోసం మరింత ఫలప్రదమైన సహకార రూపాల అన్వేషణ జరపాలనే సంసిద్ధతతో జరిగాయి.

సోవియట్ యూనియన్ సాంస్కృతిక వ్యవహా రాల మంత్రి వసీలి జహారవ్, మానవ వనరుల అభివృద్ధి విషయాల కేంద్రమంత్రి శివశంకర్‌లు రవీంద్రభవన్ ఆవరణలో ప్రపంచ విఖ్యాత రష్యన్ రచయిత అలెక్సాండ్ర్ పుష్కిన్ విగ్రహాన్ని సంయు క్తంగా ఆవిష్కరించారు. యీ వేడుకకు యితరు లతో సహా అనేకమంది కేంద్రమంత్రులు సోవియట్ వున్నతాధికారులు, సోవియట్ శిల్పి మిహాయిల్ అనికూషవ్‌లు హాజరయ్యారు.

(మిగతా 58 వ పేజీలో)

విదేశాంగ విధాన సమస్యలు

# నాల్గవ సమావేశం తర్వాత



ఎస్. యెఫిమోవ్

రేడియో, టెలివిజన్లలో, లేదా పత్రికల్లో సోవియట్-అమెరికన్ శిఖరాగ్ర సమావేశ వివరాలను అందరూ చూచేవుంటారు. మిహయీల్ గోర్బచేవ్‌ను, ఆయన భార్యను తమ మిత్రులుగా తానూ, తనభార్య నాన్సీ పరిగణిస్తున్నామని, అధ్యక్షుడు రీగన్ క్రెమ్లిన్ జార్జియెవ్‌స్కీ హాలులో జరిగిన వీడ్కోలు విందులో ప్రసంగిస్తూ చెప్పారు. మానవ నాగరికతా చరిత్రలో ఒక నవయుగం, తమదేశాలమధ్య శాంతియుగం గురించి కూడ ఆయన మాట్లాడారు.

హృదయావేశ అభివ్యక్తి అయిన ఈ ముక్తాయింపు వెనుక చాలా కథ వుంది.

సోవియట్ యూనియన్‌ను గురించి తన అభిప్రాయాన్ని అధ్యక్షుడు మార్చుకొన్నారేమో బయటికి లాగడానికి అమెరికా విలేకరులు పత్రికాగోష్ఠిలో ప్రయత్నించారు. ఎందువల్లనంటే, సోవియట్ యూనియన్ ఇక దుష్ట సామ్రాజ్యంకాదని ఆయన మాస్కో ప్రసారాలను తిలకించే రెండు బిలియన్ల మంది ప్రేక్షకుల ముందు ఒప్పుకొన్నారన్నమాట. మారింది కేవలం అభిప్రాయాలేకాదు. "దుష్ట సామ్రాజ్యం" అనే మాటను మొదటిసారి వాడటం, నీతి నియమాలూ, భవిష్యజ్జీవితంపై నమ్మకమూ లేని రష్యన్లతో సంప్రదింపులకై తానెన్నడూ కూర్చోబోనని అమెరికా ప్రకటించడం జరిగిన తరువాత గడచిన ఈ ఏడు సంవత్సరాల్లో వాషింగ్టన్, మాస్కోలు రెండూ మారాయి.

అంటే, రెండు పక్షాలూ తలపాటు నుంచి ఇంగితజ్ఞానం వైపు, రాజకీయ సంభాషణల వైపు మళ్లాయన్న మాట. ఈ సంభాషణలో సాఫీగా కాకున్నా సత్వరంగా అభివృద్ధి చెందాయి. 30 నెలల్లో నాల్గు శిఖరాగ్రసమావేశాలు! యుద్ధానంతర సోవియట్-అమెరికన్ సంబంధాల చరిత్రలోనే ఇది అపూర్వం. రెక్యావిక్, వాషింగ్టన్, మాస్కో శిఖరాగ్ర సమావేశా

లను నేను స్వయంగా చూచాను. జెనీవాలో జరిగిన మొదటి సమావేశం గురించిన నా సహచరుల నివేదికలను బట్టి, అధికార పత్రాలను బట్టి దాన్ని అంచనా కట్టగలను.

రక్యావిక్‌లో నాటకీయంగా జరిగిన సమావేశం సంగతికివస్తే అది విఫలమైనట్లు తొలుత కనిపించింది. సమావేశ భవనం నుంచి వెళ్ళిపోతున్న ఉభయ దేశాల ప్రతినిధుల భ్రుకుటిత వదనాలు మాకు జ్ఞాపకమున్నాయి. సమావేశం జరిగిన 30 నిమిషాల తరువాత పత్రికలవారితో మాట్లాడుతూ జార్జ్ షుల్ట్జ్ "అది విఫలమైనట్లే" అని అన్నారు. 50 నిమిషాల తరువాత పత్రికా గోష్ఠిలో మిహాయిల్ గొర్బచేవ్, "అది విఫలం కాలేదు. అవరోధాలను ఛేదించిన పురోగమనమది" అని అన్నారు. సోవియట్ నాయకుని అంచనా, వాదనా మరింత సునిశితమైనదీ, లోతైనదీ అని తేలింది: ఆనాడు, ప్రపంచం చరిత్రాత్మకమైన ఒప్పందాలకు కేవలం రెండడుగుల దూరంలో వుంది. ఒప్పందం సాధ్యమా? అది వాస్తవమా? ఈరెండు ప్రశ్నలకూ గొర్బచేవ్ ఔనని సమాధాన మిచ్చారు. రెండు రోజుల తరువాత, వైట్ హౌస్ కూడ ఇదే అభిప్రాయానికి వచ్చింది.

వాషింగ్టన్‌లో జరిగిన తరువాతి శిఖరాగ్ర సమావేశంలో ఉభయ పక్షాలూ, రెండురకాల అణు మిసిలీల నిర్మూలనకు సంబంధించిన సంధిపై సంతకాలు చేశాయి.

మాస్కో సంప్రదింపులు, సంధి ధ్రువీకరణ పత్రాల మార్పిడి - ఇవి 'వాషింగ్టన్ సంధి అమల్లోకి వచ్చిందనడానికి గుర్తు.

ఇదంతా బాగుంది, కాని వ్యూహాత్మక దాడి ఆయుధాలను 50 శాతం తగ్గించడంపై సంధి యేదీ? అనికొందరు విలేకరులు అడిగారు. నిజమే. ప్రజలు దానికోసం యెదురుచూస్తున్నారు. నేడుకాకపోతే రేపైనా ఆ సంధి కుదురుతుంది.

మాస్కో శిఖరాగ్ర సమావేశం మరింత ఫలదాయకంగా ఉండాల్సింది. ముఖ్యంగా. సంయుక్త ప్రకటన మరింత విషయగాంభీర్య, గౌరవయుక్తంగా ఉండాల్సింది, అని గొర్బచేవ్ పత్రికా విలేకరులతో అన్నారు. కాని ప్రధాన విషయమేమిటంటే, వ్యూహాత్మక దాడి ఆయుధాలను తగ్గించడం, పరిమితం చేయడం గురించి ఒక సంయుక్త ముసాయిదా సంధి పత్రాన్ని ఉభయదేశాల నాయకులు తయారు చేశారు. ఆ ఆయుధాల తగ్గింపుపై, అజమాయిషీకి తీసుకోవలసిన చర్యలపై ఒప్పందానికి వచ్చారు. తమ వ్యూహాత్మక సాయుధ బలాల గురించిన సమాచారాన్ని రెండు దేశాలు పరస్పరం తెలుపుకోవడం ప్రారంభించాయి. కొన్ని సమస్యలు ఇంకా అపరిష్కృతంగా వుండటం సహజమే కొత్త సంధి వాషింగ్టన్ సంధికన్నా సమగ్రమయినది. దానిలో రెండు దేశాల భద్రతకు హామీగావున్న ఆయుధాల సంగతి వుంది. ఈ ఆయుధాలను సగమే తగ్గిస్తున్నారు. మిగతా సగం మాటేమిటి? రెండుదేశాల భద్రతకు హానికలిగించకుండా వీటిని నియంత్రించడం ఎలా సాధ్యం? సంయుక్త ప్రకటనలోని మరో ముఖ్యభాగాన్ని ఇక్కడ ఉటంకిస్తాను.

"వ్యూహాత్మక దాడి ఆయుధాలను తగ్గించడం, పరిమితం చేయడంపై సంధి కుదరడానికి ప్రాతిపదికను, విస్తృతంగా జరిగిన కృషి సమకూర్చుతోందని ఎం.ఎస్.గొర్బచేవ్, రోనాల్డ్ రీగన్లు తమ విశ్వాసాన్ని సంయుక్తంగా వ్యక్తం చేశారు." సంధి రాయివిసరినంత మేరలోనే వుందని అధ్యక్షుడు లండన్‌లోని ఒక సభలో చెప్పారు. అది అంత దగ్గరలో లేక పోయినా, ఏడాదిక్రితం, ఆరునెలలక్రితం వున్నదాని కన్న చాలా దగ్గరలోనే వుందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

గత ముప్పై నెలల్లో సోవియట్-అమెరికన్ సంభాషణలు మరింత ఉరవడి పుంజుకొన్నాయి. సంభాషణలు కొనసాగుతాయి. అమెరికాలో కొత్త అధ్యక్షుడు అధికారం చేపట్టిన తరువాత త్వరలోనే సమావేశం జరిగే అవకాశం వుందా అన్న ఇజ్వెస్తియా విలేకరి ప్రశ్నకు గొర్బచేవ్, అది అతిముఖ్యమని తాను భావిస్తున్నట్లు సమాధానమిచ్చారు.

సామాజిక చింతన పరిణామక్రమం పరస్పర విరుద్ధంగా సాగింది. ఒకనాడు ప్రజలు తోసి పుచ్చిన భావనలు, విలువలు తీవ్ర విమర్శకు గురియై, చాలా కాలం మరుగు పడిన తరువాత జనాదరణ పొందడం కొన్ని సందర్భాల్లో జరుగుతూంటుంది.

నేడు అహింసా భావనకు ఇది వర్తిస్తుంది. హింస చెడ్డదనీ, మానవునికి సిగ్గు చేటనీ లోకం ఊహించిన దాని కన్న భయానకంగా పరిణమించింది.

కాని ఆ భయంకర అనుభవం నుంచి సైతం మానవాళి గుణపాఠం నేర్చుకొన్నట్లు కనిపించదు. అణ్వాయుధాలను తమ గుత్త సొమ్ముగా చేసుకొన్న అమెరికా, దాని నాటో మిత్రరాజ్యాలు పెద్దఎత్తున అణ్వాయుధాల ఉత్పత్తిని ప్రారంభించాయి. కాని సోవియట్

# అహింసాభావన : ఒక నూతన దృక్పథం

డాక్టర్ ఎ. కుత్సెంకోవ్ (చరిత్ర)
భారత విషయాధ్యయన
పరిశోధన కేంద్ర అధిపతి

మొట్టమొదట ఎవరన్నారో చెప్పడం కష్టం. వేదాంతం, బౌద్ధం, యూదుమతం, క్రైస్తవం, ఇస్లాం వంటి ప్రధానమైన ప్రాచీన మత, తాత్విక సిద్ధాంతాల్లో శాంతి, అహింసాభావన అంతర్గర్భితంగా ఉంది. అహింసా సూత్రాన్ని ప్రచారం చేసిన వారిలో లియో టాల్‌స్టాయ్ మహాత్మా గాంధీ ప్రసిద్ధులు.

రెండు కోట్లమందిని పొట్టబెట్టుకొన్న మొదటి ప్రపంచ యుద్ధం యావత్ ప్రపంచాన్ని దిగ్భ్రాంతిలో ముంచెత్తింది. మానవాళికి అదొక గుణపాఠమవుతుందనీ, అటువంటి మారణహోమం పునరావృత్తం కానివ్వరనీ అనిపించింది. కాని అది అడియాస అయింది; అయిదు కోట్ల మంది ప్రాణాలను హరించిన రెండవ ప్రపంచయుద్ధం ప్రథమ ప్రపంచ సంగ్రామాన్ని తలదన్నడమే కాక, యూనియన్ అమెరికాతో సైనిక సమానతను సాధించి, అణ్వాయుధాలపై అమెరికన్ గుత్తాధిపత్యాన్ని బద్దలు గొట్టడంతో పరిస్థితి పూర్తిగా మారిపోయింది. మూడవ ప్రపంచ యుద్ధం ఏమాత్రం అనుమతించరానిదన్న నిశ్చితాభిప్రాయానికి నేడు విశాల ప్రజానీకం, అనేకరాజకీయ, సైనిక ప్రముఖులు వచ్చారు.

ఒక నూతన రాజకీయ ఆలోచనా సరళికి సోషలిస్టు దేశాలయిన సోవియట్ యూనియన్, దాని బంధుదేశాలు శ్రీకారం చుట్టడం తార్కికంగా సహజమే. సోషలిజం సామాజిక స్వభావమే మానవతాయుతమైనది. ప్రజల పాదార్థిక సంక్షేమం, వారి ఆత్మికాభివృద్ధి దాని ప్రధాన లక్ష్యం. సోవియట్ ప్రభుత్వం జారీ చేసిన మొట్టమొదటి డిక్రీ శాంతి డిక్రీ భిన్న సామాజిక-రాజకీయ వ్యవస్థలుగల దేశాల

శాంతియుత సహజీవన భావనను ప్రతిపాదించి నది, ప్రథమ సోషలిస్టు రాజ్య వ్యవస్థాపకుడైన లెనినే. నానాజాతి సమితిలో సార్వత్రిక, సంపూర్ణ నిరాయుధీకరణ గురించిన ప్రతిపాదనను నివేదించిన మొదటి దేశం కూడ సోవియట్ యూనియనే. హిరోషిమా, నాగసాకీలపై అణు బాంబు దాడి జరిగిన తరువాత కొద్దిరోజులకే సోవియట్ యూనియన్, అమెరికాకు అణ్వా యుధాలను నిషేధించే అంతర్జాతీయ ఒప్పందంపై సంతకం చేయవలసిందిగా ప్రతిపాదించింది. ఆయుధాగారాలను తగ్గించేందుకు, సామూహిక విధ్వంసక నానా విధ ఆయుధాలను నిషేధించేందుకు ఉద్దే శించిన శాంతి ప్రతిపాదనలను వందకుపైగా సోవియట్ యూనియన్, రెండవ ప్రపంచ యుద్ధానంతర కాలంలో ప్రపంచం ముందుంచింది. కొన్ని చరిత్రాత్మక మైన ఏకపక్ష చర్యలనుకూడ అది తీసుకొంది. తన సాయుధ బలాలను తగ్గించడం, అణ్వాస్త్ర పరీక్షలపై 18 నెలల ఏకపక్ష మారిటోరియం ఇందుకు ఉదాహరణలు. సి.పి.ఎస్.యు 27 వ మహాసభ ప్రతిపాదించిన సర్వావృత అంత ర్జాతీయ భద్రతా వ్యవస్థ సైనిక, రాజకీయ, ఆర్థిక రంగాల్లో పలు నిర్మాణాత్మక చర్యలను సూచించింది. దశలవారీగా ఈ శతాబ్దాంతాని కి అణ్వాస్త్రాలను నిర్మూలించే పథకాన్ని మిహ యిల్ గోర్బచేవ్ 1986 జనవరి 15 న ప్రతి పాదించారు. 1986 నవంబరు 27న, ఆయనా రాజీవ్ గాంధీ అణ్వాస్త్ర రహిత, హింసారహిత ప్రపంచస్థాపన సూత్రాల గురించిన ఢిల్లీ ప్రక టనపై సంతకాలు చేశారు.

కాబట్టి కేవలం భావుకుల స్వప్నంగా వుంటూవచ్చిన అహింసా భావన ఒక రాజకీయ సూత్రంగా రూపొందింది. దాదాపు బిలియన్ జనాభాగల సోవియట్, భారత దేశాల పరస్పర సంబంధాలకది ప్రామాణిక సూత్రమయింది.

ప్రారంభంలో కొద్దిమంది మేధావులు, మత పముఖులు బలపరచిన ఆ భావనను రెండు



ఎ.కుత్సెంకోవ్

పెద్దరాజ్యాల రాజకీయవేత్తలు, నాయకులు ఆమోదించడానికి కారణమేమి? దీనికి సమాధానాన్ని చారిత్రక పరిస్థితులలో చూడాలని నా అభిప్రాయం. జీవిత పరిస్థితులు నిర్దేశించి నప్పుడే మానవళి యేదైనా భావనను స్వీకరిస్తుంది. విజ్ఞాన, సాంకేతిక రంగంలో విప్లవం, ఆధునిక ఆయుధాల స్వభావం, వాటిని వాడుకో వీలున్న యుద్ధ స్వభావం — ఇవే, అహింసా భావనకు విస్తృతంగా గుర్తింపు పొందడానికి దారి తీశాయి.

బాధ్యతా రహితమైన పైఎరులు, దుష్ట పన్నాగాలు, పొరపాట్లు, యంత్రపరికరాలు సరిగా పనిచేయక పోవడం మొదలయిన ఏకారణంవల్లనైనా యుద్ధం ప్రారంభం కావచ్చు. ఆయుధాల గుట్టలున్నంతకాలం ఈ ప్రమాదం వుంది.

ఏమిచేయాలి? అంతర్జాతీయ సంబంధాల తాత్వికతను మార్చడమే ఈ ప్రమాదాన్ని తొలగించే ఏకైక మార్గం — వ్యక్తుల బృందాల, వర్గ, దేశాల సమయానుకూల ప్రయోజనాలను విసర్జించి, మానవాళి ఉమ్మడి ప్రయోజ నాలూ, విలువలను అంతర్జాతీయ సంబంధా లకు ప్రాతిపదికగా చేయాలి, బలంపై ఆధార పడటం వదలుకోవాలి. అహింసాసూత్రానికి

అంటిపెట్టుకోవాలి. మానవాళి మనుగడకు సాధనంగా అహింసాభావనకు ఢిల్లీచెబుతున్న వ్యాఖ్య ఇదీ.

అహింస గురించిన ఆధునిక భావన నూతన ఆలోచనా విధానంలోని ఒక ప్రధానాంశం. అది టాల్‌స్టాయ్ మహాత్మాగాంధీ, తదితర గతకాల చింతకుల తాత్వికతలకు కొంతమేరకు భిన్నమైనది. వారి భావనలు కేవలం నైతికమైనవి. ఢిల్లీ ప్రకటన కూడ నీతి సూత్రాలను గురించి ప్రస్తావిస్తున్నప్పటికీ, మానవుని ప్రాణాన్ని అత్యున్నతమైన విలువగా, ప్రజల సంక్షేమాన్ని విధానపు కొలమానంగా పరిగణిస్తూంది. కాని దానికే ఆ ప్రకటన పరిమితం కాలేదు. దానిలోని మరో అంశం ఇంగితజ్ఞాన నిర్దేశనలకు, మానవాళి మనుగడకు సంబంధించినది. ఇది చాలాముఖ్యమైనదని నేననుకుంటున్నాను.

ఆధునిక అహింసా భావనలో మరో ప్రత్యేక లక్షణముంది. అది క్రియాశీలమైనది. ఢిల్లీ ప్రకటన హింసను విడనాడ వలసిందిగా చెప్పడమేకాక, హింసనుప్రేరేపించే అన్ని అంశాలను తొలగించవలసిందిగా కోరుతూంది. అణ్వాస్త్రాలను వినియోగించరాదనీ, అణ్వాస్త్రాల, తదితర సామూహిక విధ్వంసక ఆయుధాల ఉత్పత్తిని, పరీక్షలను నిషేధించాలనీ, వాటి నిల్వలను నిర్మూలించాలనీ అది పిలుపునిస్తోంది. అణ్వాస్త్ర రహిత, హింసారహిత ప్రపంచ స్థాపనకై సాయపడటానికై ప్రపంచవ్యాప్తంగా వ్యక్తులు, సామాజిక శక్తులు, సంస్థలు, దేశాలు ఏకంకావాలని పిలుపునిస్తోంది. జీవికకై పోరాడేందుకు ప్రజలకు నైతిక, న్యాయశాస్త్రపర హక్కుందనీ, తమ అంతరంగిక వ్యవహారాల్లో బయటవారి జోక్యాన్ని తిప్పికొట్టేందుకు రాజ్యాలకు హక్కుందనీ నిర్దేశిస్తోంది.

ఆఖరు విషయం, అహింస గురించిన ఆధునిక భావన వాస్తవిక దృష్టి, ముందుచూపుగలది. టాల్‌స్టాయ్ గాంధీ మొదలయిన మునుపటి తాత్వికులు అన్ని చెడుగులకు నాగరికతాభివృద్దే, శాస్త్ర, సాంకేతిక రంగాల పురోగతే ఏకైక కారణమని భావించారు. ఆదిమకాల ''స్వర్ణయుగానికి'' తిరిగి వెళ్ళిపోవాలన్నారు కాని మానవ నాగరికత తద్విరుద్ధ దిశగా పయనిస్తూంది. శాస్త్రపురోగతి మానవుని జ్ఞానాన్ని పెంచుతూంది. పెరుగుతున్న ఈ సాంకేతిక పరిజ్ఞానాన్ని మనిషి మేలుకోసం వినియోగించాలని ఢిల్లీ ప్రకటన చాటిచెబుతోంది. అతని సాంస్కృతిక పాదార్థిక పురోగతి దానిలక్ష్యం. అభివృద్ధికోసం నిరాయుధీకరణ దానికి పునాది. అణ్వాస్త్రరహిత, నిస్సైనికీకృత హింసారహిత ప్రపంచం, నేడు మానవాళికి ఎదురవుతున్న తక్షణ ప్రమాదకర సమస్యల పరిష్కారానికి అపార పాదార్థిక, ద్రవ్య, మానవ, ఆత్మిక వనరులను విడుదల చేస్తుంది. పర్యావరణాది సమస్యలేకాక, 800 మిలియన్ల మంది ఆకలితో మాడుతున్నారు రోగాలతోచస్తున్నారు. కాన్సర్ ఎయిడ్స్ మనిషి ప్రాణానికీ ముప్పుగా పరిణమించాయి.

సమస్తదేశాలు ఈ సమస్యల పరిష్కారానికై ఏకం కావలసిన సమయం ఆసన్నమయింది. ఏఒక్కదేశమూ ఆపని ఒంటిగా నిర్వహించజాలదు. ఈ సమిష్టికృషికి శాంతి అవసరం అహింసా భావన నూతన రూపాంతరం దానికి ప్రాతిపదికను సమకూర్చుతూంది.

అంతరంగిక, విదేశాంగ విధానాలు ఒక దానితో ఒకటి ముడిపడివున్నాయి. కాబట్టి, అంతరంగిక ఘర్షణలను — సామాజిక, రాజకీయ, తదితరమైనవి — హింసారహితంగా పరిష్కరించుకోవడం అహింసాత్మక అంతర్జాతీయ సంబంధాలకు అత్యుత్తమ హామీ కల్పిస్తాయి సామాజిక—ఆర్థికాభివృద్ధిలో, సమాజ పౌరపరిణతిలో,దాని ప్రజాస్వామిక సంస్థలలో వేరువేరు దేశాలకు వేరువేరు ప్రమాణాలున్నాయి కాబట్టి ఇది అతికష్టమైన కర్తవ్యమనితోస్తోంది.

కాని ఆ అడ్డంకులను అధిగమించవచ్చునని నా నమ్మకం. హింసారహిత ప్రపంచ మొక్కటే మనం ఎంచుకోగల ప్రత్యామ్నాయం ఆత్మహత్యకు పాల్పడకుండా నివారించగలిగినంత ఇంగితజ్ఞానం మానవాళికుంది.

# రాజకీయ వ్యవస్థలో కీలకమైన మార్పుకోసం



నికొలాయ్ పొపోవ్, పిహెచ్.డి. (చరిత్ర)

*"పెరిస్త్రోయికా మౌలిక సమస్యలకు కారణం, ఆజ్ఞాపించే, ఒత్తిడిచేసే యంత్రాంగం గల ఈ కరుడు గట్టిన ప్రభుత్వ వ్యవస్థే.... రాజకీయ వ్యవస్థ అచలమై మారకుండా వున్నట్లయితే, పెరిస్త్రోయికా కర్తవ్యాలకు మనం తూగలేము."*

*— 19వ అఖిలయూనియన్ పార్టీ సమావేశంలో మిహాయిల్ గొర్బచేవ్ నివేదికనుంచి.*

ఈ పార్టీ సమావేశంలో అభిప్రాయాలు ఘర్షించాయి, ప్రతినిధులు తీవ్ర సమస్యల పై నిర్మొహమాటంగా మాట్లాడారు. అందువల్ల సోవియట్ యూనియన్‌లోనూ, విదేశాల్లోనూ లక్షోపలక్షల ప్రజల దృష్టిని సమావేశం ఆకర్షించింది. కొన్ని దశాబ్దాల్లో మొదటిసారిగా సోవియట్ కమ్యూనిస్టు పార్టీ సమావేశం చిత్త శుద్ధితో, ఆధారాలతో సాగిన వాదోపవాదాలకూ, ఉద్రేకాలూ, కాస్త హాస్యమూ సమ్మిళితమైన ప్రసంగాలకూ వేదిక అయింది.

సోవియట్ ప్రజలు, ప్రపంచ ప్రజలు, ఒక కొత్త సోషలిజాన్ని చూచారు. సమావేశం గ్లాస్నోస్త్ స్థాయిని పెంచింది. ఒక పొలిట్‌బ్యూరో సభ్యుణ్ణి సైతం చీల్చి చెండాడిన ఆ ప్రసంగాలకు, విమర్శలకు దేశంలో, విదేశాల్లో జనం ఆశ్చర్య పడ్డారు.

దాదాపు, మాట్లాడిన వారంతా పెరిస్త్రోయికా భవితవ్యం, గురించీ, దారి తప్పుతున్న ఆర్థిక సంస్కరణ గురించీ, మాటలకే పరిమితమైన ప్రజాస్వామ్యం గురించీ ఆందోళన వ్యక్తంచేశారు. బ్యూరాక్రాట్లు తమ స్థానాలను పదిలం చేసు కొంటున్నారనీ, మేనేజిమెంటు నిరంకుశ చర్యల నుంచి నిజాయితీపరులైన పెరిస్త్రోయికా సమర్థకులకు రక్షణ లేకుండా వుందనీ అనేకులు చెప్పారు.

వచ్చిన చిక్కేమిటంటే, మనం అన్నీ ఒకే

సారి చేయవలసివుంది — ఆర్థిక వ్యవస్థను, మేనేజ్‌మెంటు యంత్రాంగాన్ని శిక్షాస్మృతిని, యింకా చాలా వాటిని సంస్కరించాల్సివుంది. అత్యధిక సమస్యలు పెనవేసుకొనివున్నందువల్ల వాటిని మూకుమ్మడిగా పరిష్కరించక తప్పదు. కాని, లెనిన్ మాటల్లో చెప్పాలంటే, మొత్తం గొలుసును చేతిలోకి తీసుకొనేందుకు, దానిలోని ఏ ప్రత్యేకలింకును పట్టుకోవాలో తెలుసుకోవాలి.

రాజకీయ వ్యవస్థను మనం మార్చనిదే, ఆర్థిక రంగంలో, ప్రతిఒక్కరి జీవితంలోనిజమైన మార్పులు రాబోవని ప్రజలకు తెలిసివస్తూంది. దేశాన్ని ఎవరు, ఎలాపాలిస్తున్నారో, ప్రజలు తమ హక్కులను, అధికారాన్ని ఎలా ఉపయోగిస్తున్నారోవారు తెలుసుకోవాలి. అధికారం, స్వేచ్ఛ, వాటిమధ్య సంబంధం–ఇవి రాజకీయ, సామాజిక జీవితాన్ని ఎల్లప్పుడూ శాసిస్తున్నాయి. అధికారంహెచ్చితే, స్వేచ్ఛ తగ్గిందన్నమాటే.

ఈనాడు మనం వాటి ఈ పరస్పరసంబంధాన్ని మారుస్తున్నాము. ఆచరణలో పరీక్షించి, తప్పులు దిద్దుకోవడం—ఇదీ అందుకు అనుసరిస్తున్న పద్ధతి. ఇలా ఎందుకు చేస్తున్నాం? ఈ సమస్యపై సిద్ధాంతాలు, సూత్రీకరణలూ చాలానేవున్నాయి. కాని, చాలాకాలం వాటిని నెత్తిన పెట్టుకొని, ఇప్పుడు సంక్షోభంలోపడనున్న స్థితికి చేరుకొన్నాము. కాబట్టి ఇంగితజ్ఞానాన్ని ప్రజల చొరవను ఉపయోగించాల్సిన సమయం వచ్చింది. అధికారాన్ని చట్టరీత్యా పరిమితం చేసి, స్వేచ్ఛను సాధించి, దాన్ని వినియోగించే తీరును నేర్చుకొనే అవకాశం వుంది. అదే మనం పట్టుకోవలసిన ప్రత్యేకమైన లింకు.

మనకు స్టాలిన్ నుంచి ఒక రాజకీయ యంత్రాంగం సంక్రమించింది. అది దమన నీతికి, వేధింపునకూ పట్టంకట్టింది. తరతమ భేదాలతో వ్యక్తి ఆరాధనలను చూచాము. కేవలం నాయకులను మార్చడం నిష్ప్రయోజనమని తేలింది.

స్టాలినిస్టు వ్యవస్థలోని మరో లక్షణం నియంతృత్వం, మెడలు వంచే ఆదేశపూర్వక పద్ధతుల ప్రాతిపదికపై సామాజిక జీవితాన్ని గాను గెద్దులా నడిపించడం. ఆ లక్షణం యింకావుంది. స్వయంపాలన, ప్రత్యక్ష ప్రజాస్వామ్యాలకు మారు, "మన సొంత" బ్యురాక్రటిక్ రాజ్యాన్ని సృష్టించాము. అది ప్రతి పౌరుని జీవితంపై నిఘా వుంచింది, అన్ని రంగాల్లో జోక్యం చేసుకొంది. ఇది చొరవ గొంతును నులిమి, సామాజిక నిర్లిప్తతలోను, కపట ప్రవృత్తిని, ద్వంద్వప్రమాణాలను, అవినీతిని పెంచి పోషించింది. మూడేళ్ల క్రితం ప్రారంభమయిన సమాజపు నరుజ్జీవన క్రమం ఆర్థిక, రాజకీయ చొరవను విడుదల చేస్తోంది. కాని ప్రజాతంత్రీకరణ క్రమం మరీ మందకొడిగా సాగుతోంది.

19వ సమావేశం రాజకీయ సంస్కరణను అమలుజరిపే నాలుగు ప్రధాన మార్గాలను సూచించింది; అవి, సర్వాధికారాలను సోవియట్లకు ఇవ్వటం; పార్టీ పాత్రను పునః పరిశీలించి, సరిదిద్దడం; బాధ్యతలను వేర్పరచడం; సోషలిస్టు చట్ట బద్ధ పరిపాలక రాజ్యాంగ వ్యవస్థను స్థాపించడం.

ప్రభుత్వ ప్రధాన సంస్థలుగా సోవియట్లకు సంపూర్ణ అధికారాన్ని తిరిగి దఖలు పరచాలని వేరేచెప్పవనిలేదు. వాటికి ఆర్థికాధికారాలను, ఆదాయవనరులను ఎలా దఖలుపరచాలి, తమభూభాగంలోని సమష్టి వ్యవసాయ క్షేత్రాలతో, కర్మాగారాదులతో, సహకారసంస్థలతో, ప్రజాసంఘాలతో సోవియట్ల సంబంధాలను ఎలాచట్టబద్ధంగా స్థిరపరచాలి అనేది సమస్య.

ప్రజాస్వామ్యం, పెరిస్త్రోయికా నెలకొన్న పరిస్థితుల్లో పార్టీ పాత్రకు సంబంధించిన ఒక ముఖ్య సమస్యనుకూడా సమావేశం చర్చించింది. "పార్టీ సంస్థలు అమలు జరుపుతున్న హుకుందారీ పని పద్ధతులను పూర్తిగా విసర్జించడం", "ప్రభుత్వ, ఆర్థిక సంస్థల స్థానంలో పార్టీ కమిటీలు పనిచేసే ఆచారాన్ని విసర్జించడం", "ప్రభుత్వ సంస్థలకు ప్రత్యక్ష ఆదేశాలిచ్చే నిర్ణయాలను పార్టీ ఆమోదించరాదని నిషేధించడం" ప్రస్తుత లక్ష్యమని

సమావేశం తీర్మానించింది.

నాయకత్వం విషయంలో రాజకీయ పద్ధతుల కుమారటం రాజకీయ సంస్కరణలోని, చట్ట బద్ధ పరిపాలకరాజ్యాంగ వ్యవస్థలోని ప్రధాన అంశాల్లో ఒకటి.

పార్టీ సంస్థల ప్రథమకార్యదర్శులు సోవి యట్లకు ఎన్నికైన అధ్యక్షులుగా కూడా వుండా లని సమావేశం సూచించింది. దీనిపై పెద్దగా చర్చజరగలేదు. ఎందువల్లనంటే ప్రతినిధులు దానిపై చర్చకు సిద్ధంగాలేదు. తాము ప్రజలను సంప్రదించాలని కొందరన్నారు. కాని, నిజంగా ప్రజాస్వామికమైన ఎన్నికలు జరిగి నట్లయితే, బ్యూరాక్రాట్లనుండి అధికారా న్ని లాక్కొని, దాన్ని తిరిగి ప్రజా ప్రతినిధు లకు, అంటే ఓటర్లకు జవాబుదారీగావున్న సోవియట్ సభ్యులకు తిరిగి అప్పగించిన వారమవుతాము.

వేరు మాటల్లో చెప్పాలంటే, శాసననిర్మాణ అధికారాలను, కార్యనిర్వాహక అధికారాలను వేరుపరచే అవకాశం యేర్పడుతుంది. శాస ననిర్మాణాధికారానికి పాలక పార్టీ ప్రతిష్ఠ దన్ను యివ్వగలదు.

సోవియట్ సభ్యులపైనా, ఓటర్లపైనా ఒత్తిడి తెచ్చేవీలులేకుండా చేయగల కార్యవిధానాలను రూపొందించడం అసలు కర్తవ్యం. ప్రజలనిజ మైన స్వయంపాలన పెంపొందే పరిస్థితుల ను సృష్టించాలి. తద్వారా ప్రజాప్రతినిధులు సోవియట్లపై పూర్తిగా ఆధారపడిన కార్యనిర్వాహక సంస్థల కార్యకలాపాలకు మార్గదర్శక సూత్రా లను నిర్ణయిస్తారు.

ప్రజాప్రతినిధుల సోవియట్ల నిర్ణయాలను పార్టీ, పార్టీకమిటీల ప్రతిష్ఠ పటుతరం చేస్తుంది. ఈకమిటీల ప్రథమకార్యదర్శులు వాటిప్రతినిదులేకదా

ఇదంతా, మనం చేనికివ్యతిరేకంగా పోరాడు తున్నామో ఆ అధికార కేంద్రీకరణ యింకా హెచ్చడానికి దారితీస్తుంది కదా, అని కొందరి వాదం. కాని యీ విషయంలో సమావేశం నిర్ణయించిన దిశగా పురోగమించేందుకు అనుసరించే కార్య విధానాలపైనా, ప్రజల సంకల్ప బలంపైనా ప్రతిఒక్కటీ ఆధారపడి వుంటుంది.

ప్రజాతంత్రీకరణ పరిస్థితుల్లో పార్టీకి కొత్త రాజకీయపాత్రవున్న పరిస్థితుల్లో, పార్టీకార్యద ర్శులు తమ రాజకీయ కృషిని, సమాజానికి రాజకీయనాయకత్వం వహించగల తమ శక్తిని నిరూపించుకొనే అవకాశాన్ని సోవి యట్లకు జరిగే ఎన్నికలు. వారికిస్తాయి. స్థానిక ప్రభుత్వంలోని స్థానాలకు జరిగే పోటీలో వారు తమ సత్తాను నిరూపించుకోవలసి వుంటుంది.

అత్యున్నత రాజ్యాధికార స్థాయిల్లో స్వయం పాలనా సూత్రాలను మెరుగు పరచడం మరో ముఖ్య సమస్య. రాజ్యాధికార అత్యున్నత సంస్థలో మార్పునకు సమావేశం ఒక విస్తృత కార్యక్రమాన్ని ప్రత్యేకించి, ఒక కొత్తఅత్యున్నత ప్రాతినిధ్య సంస్థను — ప్రజాప్రతినిధుల మహాసభను సూచించింది.

పత్రికల్లో, శాస్త్రీయ చర్చల్లో వ్యక్తమయిన సూచనల ప్రకారం, యీ మహాసభ ఒకస్థాయీ సంఘాన్ని ఎన్నుకోవాలని సమావేశం ప్రతి పాదించింది. అది 400-500 ప్రతినిధులు గల సుప్రీం సోవియట్. అదొకవిధమైన సోవియట్ పార్లమెంటు. దానిలోని సభలకు దేనికదాని నిర్దిష్ట విధులుంటాయి. సుప్రీం సోవియట్‌కు అధ్యక్షపదవిని స్థాపించడం కొత్త రాజకీయ వ్యవస్థ ప్రయోజనాలకు అను గుణమైనది.

సమావేశంలోని చాలా మందిప్రతినిధులు గ్లాస్నోస్త్‌ను గురించి మాట్లాడారు. విమర్శనాత్మ కరచనలూ, చెడువార్తలు పెద్ద ఎత్తున వెలువడు తున్నందుకు చాలామంది చీదరించుకొన్నారు పత్రికలపై తప్పుమోపప్రయత్నించారు. కాని తప్పు వార్తాహరులదా? పత్రికలు తప్పుడున మాచారాన్ని ప్రకటిస్తున్నాయని వీరి వాదన. కొన్ని సందర్భాలలో అదినిజమే.

కాని, "సోషలిజం స్వచ్ఛతను కాపాడే" ముసుగులో గ్లాస్నోస్త్‌పై దాడిచేసే శక్తులను గురించి గోర్బచేవ్ తన నివేదికలో ప్రస్తావించారు.

"సత్యాన్ని న్యాయాన్ని పునరుద్ధరిస్తు

న్నందుకు, సోషలిస్టు భావజాలాన్నీ ఆచరణనూ వికృతంచేసిన ప్రతిదాన్ని విసర్జిస్తున్నందుకు, మూసపోత పద్ధతులను, పిడి సూత్రాలను ధ్వంసంచేస్తున్నందుకు ప్రతిస్పందిస్తూ కొంత మంది, ఇదంతా సోషలిజం మూల సూత్రాలను, మూలస్తంభాలను దెబ్బగొడుతూందనీ, దాని చరిత్రపై బురదచల్లుతూందనీ వాదిస్తున్నారు దీనితో మనం అంగీకరించలేము, కామ్రేడ్స్. మూటికిముమ్మాటికీ అంగీకరించలేము."

ఇలాచెప్పిన తరువాత కూడ కొంతమంది ప్రతినిధులు "గ్లాస్నోస్త్ స్వైరవిహారం" గురించి ఫిర్యాదులు చేశారు. నేడు పత్రికలు కేవలం వాస్తవ సమాచారమందించే బాకాలు కాదు. పెరిస్త్రోయికా వైరుధ్యాలను, అది ఈడిగిల బడటానికి కారణాలను, త్వరీకరణకు ప్రజాతంత్రీకరణకుగల అంతర్గత శక్తులను లోతుగా అధ్యయనం చేయడం — యివి గ్లాస్నోస్త్ విస్తరణకు అవసరం. "గ్లాస్నోస్త్‌పై" పైనమావేశం ఆమోదించిన తీర్మానంలో యిలావుంది: "వివాదంలోని అన్ని పక్షాల దృక్పథాలను సమాచార బహుళప్రసార సాధనాలు నిష్పక్షపాతంగా, వక్రీకరణలు లేకుండా ప్రతిబింబించాలి. సత్యం ఎవరిగుత్తసొమ్మూకాదు; గ్లాస్నోస్త్‌పై ఎవరి గుత్తాధిపత్యం వుండరాదు"

కేంద్రపత్రికలు వివిధ అభిప్రాయాలను ప్రతి బింబించగలుగుతున్నాయి చిన్న పట్టణాల్లో గ్లాస్నోస్త్‌కు అడ్డుకట్ట వేశారు. అక్కడి పత్రికలు స్థానిక ప్రభుత్వ పార్టీ సంస్థల అదుపాజ్ఞల్లో వున్నాయి.

ప్రజాతంత్రీకరణకు, గ్లాస్నోస్త్‌కు పత్రికాస్వేచ్ఛ అవసరం. అది పార్టీకి, సమాజానికి, రాజ్యాంగ, శాసనపర ప్రామాణిక సూత్రాలకు, సత్యానికి బాధ్యత వహించనిస్వేచ్ఛకాదు, డిపార్ట్‌మెంటుల ప్రభావంనుంచి, స్వప్రయోజనపరులైన, ఉన్నత పదవుల్లోవున్న బ్యూరాక్రాట్ల నుంచి వాటికి స్వేచ్ఛ వుండాలి. తన రోగి ఆరోగ్యంగురించిన సమాచారం వైద్యునికి ఎంత అవసరమో, ప్రజలకు, సమాజానికి సత్యం తెలుసుకోవడం అంత అవసరం.

# సోవియట్ ఆర్థిక వ్యవస్థ స్తంభిస్తున్నదా? పురోగమిస్తున్నదా?

ప్రొ. గియోర్గి సర్కిస్‌యాంత్స్
డాక్టర్ ఆఫ్ ఎకనామిక్స్

సోవియట్ సమాజంలో జరుగుతున్న సమస్త రాజకీయచర్చల్లో అభిప్రాయాల అనేకత్వం యిప్పుడు ఒకవిలక్షణంగా వుంటోంది. గత జూన్, జూలై నెలల్లో జరిగిన మనపార్టీ సమావేశంలో మనదేశ ఆర్థిక పరిస్థితిపై వేసిన అంచనాలు యిందుకు స్పష్టమైన వుదాహరణ.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రధానకార్యదర్శి **మిహయిల్ గొర్బచేవ్, సోవియట్ విజ్ఞాన** శాస్త్రాల అకాడమీ ఆధ్వర్యానగల ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఎకానమీ డైరెక్టరు లియొనిద్ అబాల్కిన్‌లు తమ తమ ప్రసంగాల్లో ఒకేవిధమైన గణాంకవివరాలను ఉటంకిస్తూ పూర్తిగా భిన్నమైన నిర్ధారణలుచేశారు.

"మన ఆర్థిక వ్యవస్థలో సానుకూల మార్పులు జరుగుతున్నాయనడంలో సందేహం లేదు... కానీ మన ఆర్థికవ్యవస్థ గణనీయమైన పురోగతిని సాధించలేదనీ, తన స్తంభన పరిస్థితుల**నుండి బయట పడలేదనీ, చాలాకచ్చితంగా** చెప్పక తప్పదు" అని అకడమీషియన్ లియొనిద్ అబాల్కిన్ అన్నారు.

మిహయిల్ గొర్బచేవ్ చాలా వాస్తవికమైన అంచనావేశారు: "మన ఆర్థిక వ్యవస్థ క్రమక్రమంగా పుంజుకుంటోంది. గత సంవత్సరం,

మొట్టమొదటిసారిగా శ్రమవుత్పాదకతను పెంచ డంద్వారానే జాతీయాదాయంలో మొత్తం పెరుగుదలను సాధించాం. తలసరి నిజఆదాయాలు తిరిగి పెరగడం మొదలైంది: ప్రస్తుత పంచవర్ష ప్రణాళికలోని గత రెండు సంవత్సరాల్లో (1986-1987) యివి 4.6 శాతం పెరిగాయి... మనం ఆత్మవిమర్శచేసుకోవాలి; ప్రధాన పెరిస్త్రోయికారంగాల్లో, యీ మూడు సంవత్సరాల కాలంలో సాధించిన దానికన్నా యెక్కువ సాధించ గలిగి వుండేవారమని అంగీకరించాలి; యిది ముఖ్యంగా మన ఆర్థిక వ్యవస్థ సామర్థ్యాన్ని పెంచడం ద్వారా, దాని అంతిమ ఫలితాలను మెరుగుపర్చడం ద్వారా సాధించవీలుండింది."

పార్టీ నూతన నాయకత్వం 1985 ఏప్రిల్‌లో పెరిస్త్రోయికా విధానాన్ని ప్రకటించింది. ఆర్థిక, సామాజిక అభివృద్ధిలో ముఖ్య మార్పులను ఆశించడానికి యిదేమంత సుదీర్ఘమైన కాలం కాదు. దీన్ని యెవరూ కాదనలేరు. ప్రభుత్వం పై ఆధారపడడానికి బదులుగా పనిచేయడానికి నూతన పరిస్థితులను (అంటే మేనేజిమెంటు అప్పగింత, పరిశ్రమాది సంస్థల ఆర్థిక స్వయం ప్రతిపత్తికి ప్రోత్సాహం, అవి స్వయంగా డబ్బును సమకూర్చుకోవడం, వుత్పత్తి ఖర్చుల మదింపు) యీ సంవత్సరమే, ప్రభుత్వ పరిశ్రమాది సంస్థల, సహకార సంస్థల గురించిన శాసనాలు అమలులోకి వచ్చిన అనంతరమే సృష్టించడం జరుగుతోంది.

పరిశ్రమలరంగంలోని ప్రభుత్వ సంస్థల్లో 60 శాతం యిప్పుడు నూతన పరిస్థితుల్లో పనిచేస్తున్నాయి. మిగతా సంస్థలు యీ నూతన పద్ధతిలో పనిచేయడం వచ్చే సంవత్సరం నుండి ప్రారంభిస్తాయి.

దేశం 1986 లో 210 మిలియన్ టన్నుల, 1987 లో 211 మిలియన్ టన్నులధాన్యాన్ని వుత్పత్తిచేసింది. గతదశాబ్దంలోని మొదటి ఐదు సంవత్సరాల్లో ధాన్యం సగటు వార్షిక వుత్పత్తి 180 మిలియన్ టన్నులు వుండింది.

ఇక ఆర్థికవ్యవస్థ సామర్థ్యం గురించి చెప్పాలంటేసోవియట్ చరిత్రలో మొట్ట మొదటి సారిగా కార్మికుల సంఖ్యను తగ్గించి కూడా జాతీయాదాయంలో గణనీయమైన పెరుగుదలను సాధించడం జరిగింది. సహకార సంస్థలకు, వ్యష్టి శ్రమకు యితోధిక ప్రోత్సాహం లభించింది.

ఈ సమాచారం మిహాయిల్ గొర్బచేవ్ అభిప్రాయాన్ని ధృవీకరిస్తోంది. ఆర్థికాభివృద్ధిలో సమూలమైన మార్పు జరిగిందని చెప్పడం తొందరపాటే అవుతుందని స్వయంగా ప్రధాన కార్యదర్శే అంగీకరించారు. యింతవరకూ చేసినదంతా దేశం సంక్షోభంలో పడిపోకుండా నివారించడానికే; త్వరితగతి పురోగమనానికి పూర్వాపేక్షితాలను సృష్టించడానికే కృషి జరిగింది.

ఈ సంవత్సరం సేకరించిన ప్రజాభిప్రాయంలో పెరిస్త్రోయికా పరిణామక్రమాలు ప్రతిబింబించాయి. గతమూడు సంవత్సరాల్లో ఆర్థిక వ్యవస్థ, సామాజిక విధానం కచ్చితమైన పురోగతిని సాధించాయని జనాభాలోని. అత్యధికులు అభిప్రాయపడ్డారు. అయితే తమ అభిప్రాయాన్ని తెలిపిన జనాభాలో మూడవ వంతు (యిది తక్కువ సంఖ్యయేమీ కాదు) ఆచరణాత్మకమైన ఫలితాలేవీ కనిపించడం లేదని పేర్కొన్నది. పెరిస్త్రోయికా లక్ష్యాలు ఆచరసాధ్యమైనవే అని 70 శాతం జనాభా తన విశ్వాసాన్ని వ్యక్తం చేసింది. రానున్న ఐదు సంవత్సరాల్లో శ్రమవుత్పాదనను యితోధికంగా పెంచవచ్చునీ, తత్ఫలితంగా తమ వేతనాలూ, జీవిత నాణ్యతా పెరుగుతుందని చాలా మంది అభిప్రాయపడ్డారు.

భావి పంచవర్ష ప్రణాళిక (1991-1995) రూపకల్పనలో నూతన వైఖరులను అవలంబించడానికి నూతన ఆలోచనా ధోరణి, ఆర్థిక సంస్కరణలు, గడించిన అనుభవం తోడ్పడుతాయి. ఈ ప్రణాళిక భావనను ప్రస్తుత సంవత్సరాంతంలో లేదా వచ్చే సంవత్సరారంభంలో ఆమోదిస్తారు. పెరిస్త్రోయికా ప్రథమ సంవత్సర ఫలితాల ఆధారంగా భావి పంచవర్ష ప్రణాళిక ప్రధాన సారాన్ని పార్టీ 19వ సమావేశం నిర్వచించింది; అది సోవియట్ ఆర్థిక వ్యవస్థకు తిరిగి సామాజిక వున్ముఖత సమకూర్చుతుంది.



# నాణ్యతకే ప్రప్రథమ ప్రాధాన్యత

ప్రొ. నికలాయ్ ష్మెలేవ్

సోవియట్ ఆర్థిక పురోగతిని పరిమాణాత్మక గీటురాళ్లతో కొలవడం మానివేయాల్సిన సమయమాసన్నమైందని డాక్టర్ నికలాయ్ ష్మెలేవ్ (అర్థశాస్త్రం) అభిప్రాయం. అత్యున్నత సాంకేతిక పరమైన శాఖల్లోనే పరిమాణాత్మక పెరుగుదలకు ప్రాధాన్యత వుందని ఆయన అన్నారు. పారిశ్రామిక దేశాల జాతీయ వుత్పత్తిలో సాంకేతిక వుత్పత్తుల వాటా 6-8 శాతానికి మించదు. మిగతా వుత్పత్తి అంతా సాంప్రదాయ పరిశ్రమల నుండే లభిస్తోంది. వుత్పత్తుల సాంకేతిక స్థాయి, నాణ్యతల్లో కావాల్సింది గుణాత్మక పెరుగుదలేకాని పరిమాణాత్మక పెరుగుదలకాదని ఎ.పి.ఎస్ విలేఖరితో ష్మెలేవ్ అన్నారు.

సోవియట్ ఆర్థిక వ్యవస్థలోని ప్రస్తుత సమస్యల గురించి "పురోగమనాలు, చెల్లింపులు" అనే శీర్షికతో ఆయన ఒక వ్యాసం రాశారు. యీ వ్యాసం ఆయనకు సోవియట్ యూనియన్‌లో, విదేశాల్లో మంచిపేరు తెచ్చింది. ఈయన సోవియట్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీలోని అమెరికా, కెనడా విషయాల ఇనిస్టిట్యూట్‌లో పనిచేస్తున్నారు.

తన వ్యాసంలో వెల్లడించిన అభిప్రాయాలు కొత్తవేమీ కాదని ఆయన అభిప్రాయం. యీ ఆలోచనలన్నీ నిపుణ ఆర్థికవేత్తలకు తెలుసనీ, వీటిని కార్యనిర్వాహకులకు వారు 20, 30 యేళ్ల క్రితమే తెలియజేశారనీ, వాటిని పరిశీలించడానికి అప్పుడు అంత ఆసక్తి కనపర్చలేదనీ ఆయన అన్నారు. తన అభిప్రాయాలను ముక్కుసూటిగా తెలియజేయడం వల్లనూ, తన వ్యాసాన్ని చాలాపేరుగాంచిన, 1,150,000 ప్రతుల సర్క్యులేషన్ గల నొవ్యీ మీర్ ప్రచురించడం వల్లనూ అది అంతటి పేరుపొందిందని ష్మెలేవ్ వివరించారు.

ఇప్పుడు పరిస్థితిమారింది. ఆర్థిక శాస్త్రవేత్తల అభిప్రాయాలను ఆలకిస్తున్నారు. నా వ్యాసంలో పేర్కొన్న అంశాలు, 1987జూన్‌లో జరిగిన సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీప్లీనరీ సమావేశం చేసిన నిర్ణయాలు చాలా వరకు ఒకే విధంగా వున్నాయి. క్లుప్తంగా చెప్పాలంటే సలహాలివ్వటం ఆర్థికవేత్తలపని, నిర్ణయాలు చేయడం నాయకత్వం పని అని ఆయనన్నారు.

ఆర్థికాభివృద్ధి రేట్లపై నా అభిప్రాయాలను అందరూ అంగీకరిస్తారని నేను చెప్పడం లేదు అయితే కొన్ని పత్రికలు, ఉదాహరణకు **కమ్యూనిస్టు** యిటీవల నేను వెల్లడించిన అభిప్రాయాలను వ్యక్తంచేస్తూ వ్యాసాలు ప్రచురిస్తోంది.

వ్యవసాయోత్పత్తిని కూడా సోవియట్ యూనియన్ పెంచాల్సిన అవసరంలేదని నా అభిప్రాయం. ప్రస్తుతం దేశం సాలీనా 20-25 శాతం. ఆహారధాన్యాలను, 50 శాతానికి పైగా కూరగాయలను, పళ్లను నష్టపోతున్నదనీ, యిందుకు కారణం రోడ్లు సరిగా లేకపోవడం, క్షేత్ర ఉత్పత్తులను నిల్వచేసే సౌకర్యాలు తగినంతగా లేకపోవడం, వాటిని తగు విధంగా శుద్ధి చేయకపోవడమేననీ ఆయన అన్నారు. యీ సమస్యలను ముందుగా పరిష్కరించాలి. విచిత్రమైన విషయమేమంటే లాభనష్టాలను బేరీజు వేసే పద్ధతికి ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు మారిన మరుక్షణమే అవి మొట్టమొదట ట్రాక్టర్ల కొనుగోలును 30 శాతం తగ్గించాయన్నారు. లోగడ వాటిని కొనుగోలు చేయడానికి అవి ప్రభుత్వ బడ్జెటునుండి చెల్లించాయి. కాని యిప్పుడు అవి ట్రాక్టర్ల కోసం డబ్బును స్వయంగా చెల్లించాల్సి వుంటుంది.

గత సంవత్సర జాతీయ ఆదాయం పథకం ప్రకారం 4.1 శాతం కాక 2.3 శాతమే పెరిగింది. సంస్కరణ దశలో వున్న దేశానికి నాలుగు శాతం పెరుగుదల కాక ఒక శాతం పెరుగుదల సిద్ధించే అవకాశం కూడా వుందని ఆయన అన్నారు.

ఆర్థిక వ్యవస్థపై పెరిస్త్రోయికా తన పూర్తి ఫలితాలను ఎప్పుడు కనబరుస్తుందో చెప్పడం కష్టం. పరిశ్రమల్లో తీవ్రసానుకూల ప్రగతిని 1993-1995 లలో ఆశించవచ్చు. వ్యవసాయంలో, మార్కెట్టుకు ఆహారపదార్థాల సరఫరా చేయడంలో త్వరగా విజయం సాధించవచ్చు, అయితే యీరంగంలో సంస్కరణను అమలు జర్పడానికి తగినంత పట్టుదల లేదని ష్మెలేవ్ అభిప్రాయపడుతున్నారు.

ఏదేమైనప్పటికీ ఆర్థికవ్యవస్థలో పెరిస్త్రోయికావల్ల యిప్పటికే కొన్ని ఫలితాలు లభిస్తున్నాయి. సరకుల, పదార్థాల నిల్వలను తగ్గించాలనే ధోరణి ప్రబలుతోంది — యిది ఆర్థికవేత్తల అభిప్రాయాలకు గణనీయమైన గుర్తింపు అని అన్నారాయన. ''ఇది ప్రోత్సాహకరమైన ధోరణి. నాణ్యతలో, ముఖ్యంగా ఇంజనీరింగ్ వుత్పత్తుల నాణ్యతలో, కొంత పురోగతి కనిపిస్తోంది. ఇట్కు కార్యనిర్వాహకులూ, అటు కార్మికులూ ఆదేశాత్మక మేనేజిమెంటు పద్ధతిని క్రమక్రమంగా వదిలించుకుంటూ ఆర్థిక లెక్కల్లో ఆలోచించడం మొదలు పెట్టారు'' అని ష్మెలేవ్ అన్నారు.

సామాజిక రంగంలో మార్పులు కానవస్తున్నాయి. గృహాల నిర్మాణం వేగమూ, నాణ్యతా పెరిగింది. ఆరోగ్య సేవల్లో ప్రగతి వుంది. కార్మికుల్లోని కొన్ని అభివర్గాలకు యిప్పుడు యెక్కువ వేతనాలు లభిస్తున్నాయి.

పెరిస్త్రోయికాకు అవరోధాలు, తీవ్ర అవరోధాలు యెదురౌతున్నాయని ష్మెలేవ్ అన్నారు. మొదటిది, సుమారు, గత 60 యేళ్లుగా దాదాపు యేమాత్రం మార్పులేకుండా పని చేస్తున్న పాత ఆర్థిక యంత్రాంగం. రెండవది; సంస్కరణలో యేదో ఒకటి కోల్పోయున్న పలుకుబడి గల బృందాల ప్రతిఘటన. మూడవది, జనాభాలో యేదో ఒకవిధమైన భయం నెలకొని వుంది. ధరల సంస్కరణ, ఆర్థిక సంస్కరణ అంటే ప్రజలకు భయంగా వుంది.

ష్మెలేవ్‌కు పెరిస్త్రోయికాపై గట్టి విశ్వాసమేర్పడింది. యిది యిప్పుడు తిరుగులేనిదైందని ఆయన అన్నారు. ''మనం ప్రతిఒక్క మార్గాన్ని పరీక్షించి చూశాం కాబట్టి మనం వెనుదిరిగే సమస్యే లేదు. కాగా ప్రతిఘటించే శక్తులు యెన్నో సందేహాలను వెలిబుచ్చుతున్నాయి. అవి యెలాంటి సానుకూల లేదా సాధ్యమైన పరిష్కారాలను చూపలేవు'' అని ష్మెలేవ్ అన్నారు.



డాక్టర్ ఒత్తో లాత్సిన్ (అర్థశాస్త్రం)

కమ్యూనిస్టు పత్రిక డిప్యూటీ చీఫ్ ఎడిటర్

సోవియట్ యూనియన్‌లో ఆర్థిక సంస్కరణ పరీక్షలదశ యీ సంవత్సరారంభంతో ముగిసింది. యీ పరీక్షల దశలో నూతన ఆర్థిక యంత్రాంగాన్ని పరీక్షించారు. దీన్ని విస్తృతస్థాయిలో యీ సంవత్సరారంభంలోనే ప్రవేశ పెట్టారు. పరిశ్రమాది సంస్థల్లో సగం వరకూ లాభనష్టాలను బేరీజు వేసుకునే పద్ధతికి మారాయి. 1990 నాటికి యీ పద్ధతి మొత్తం జాతీయ ఆర్థిక వ్యవస్థకు పరివ్యాప్త మౌతుంది. సంస్కరణకు ముందు జరిగిన చర్చలు యింతటితో ముగిసిపోతాయని యెవరైనా అనుకుంటారు. కాని అందుకు భిన్నంగా యివి మరింత వుధృతితో కనీవినీ ఎరుగని రీతిలో జరుగుతున్నాయి.

"మరింత సోషలిజం" అనే నినాదంతో మిహయిల్ గోర్బచేవ్ ప్రకటించిన పెరిస్త్రోయికాపై ప్రత్యేకించి తీవ్రచర్చలు సాగుతున్నాయి. దీనర్థమేమిటి? సోషలిజాన్ని నిర్మించామని 1930 లలోనే సోవియట్ యూనియన్ ప్రకటించింది కదా? సోవియట్ యూనియన్ పూర్తిగా సోషలిస్టు స్వభావంగలదైపోయిందనీ, ప్రయివేటు వుత్పత్తి యేమాత్రం వునికిలో లేదనీ గత మూడు దశాబ్దాల గణాంక వివరాలు తెలియజేస్తున్నాయి కదా? అని చాలా మంది ప్రజలు అడుగుతున్నారు. మరో ప్రశ్న కూడా వేస్తున్నారు: మనకు యిప్పుడు సహకార సంస్థలు, కుటుంబ కాంట్రాక్టులు, వ్యష్టిశ్రమ వున్న పరిస్థితుల్లో గతంలో వున్నదాని కన్నా, ప్రతిజక్కటి ప్రభుత్వానికి, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు చెందివున్నట్టి పరిస్థితిలో వున్న దానికన్నా యెక్కువ సోషలిజం వుందా? సోషలిస్టు ఆస్తికి జరుగుతున్న దేమిటి?

చట్ట రీత్యా చూసినప్పుడు సోవియట్

యూనియన్‌లోని ఆస్తి చాలాకాలం క్రితమే వాస్తవంలో సోషలిస్టు స్వభావం గలదైపోయింది. యేది యేమైనప్పటికీ ఒక పరిశ్రమాది సంస్థను జాతీయం చేసి, తత్సంబంధిత చట్టాల ప్రకారం దాన్ని ప్రభుత్వ ఆస్తిగా చేసినంత మాత్రాన అది తప్పనిసరిగా అప్పటినుండీ సామాజిక యాజమాన్య ఆస్తిగా పని చేయదని మన అనుభవం తెలియజేస్తోంది.

సోవియట్ యూనియన్‌లోని ఆస్తిలో సామాజికీకరణ తగినంత లేనందున "యావన్మంది" ఆస్తి వాస్తవంలో "ఎవరికీ చెందని ఆస్తిగా పరిగణించడం జరిగింది. సోవియట్ నాయకత్వం యిప్పుడు మార్చ దల్చుకున్న యంత్రాంగం కాలంచెల్లినది. అది కార్మికుల పని తుది ఫలితాలతో వారి ఆదాయాలను అనుసంధించదు. ఒక ఫ్యాక్టరీ మేనేజిమెంటును కూడ "ఎవరికీ చెందని" సామాజిక యాజమాన్య ఆస్తిగా పరిగణించడం జరిగింది. యీదృష్ట్యా చూసినపుడు ప్రధానమైనది వుత్పత్తి సామర్థ్యం కాదు; దీనికన్నా ముఖ్యమైనది ఏజెన్సీలు 'అత్యున్నత అధికారుల'తో మంచి సంబంధాలు పెట్టుకోవడం, వుత్పత్తి పథకాలను సర్దుబాటు చేయగల, యితోధిక నిధులను కేటాయించగల శక్తి కలిగి వుండడం. చివరి విషయం, కేంద్ర ఆర్థిక సంస్థలు జాతీయ ప్రయోజనాల దృష్ట్యా కాకుండా తమ సంకుచిత ప్రయోజనాలతో బిలియన్ల కొద్దీ రూబుళ్లను దాదాపు యెట్టి నియంత్రణ లేకుండా విచ్చలవిడిగా ఖర్చుచేశాయి.

లాభాలు-ఖర్చుల లెక్కలను పూర్తి స్థాయిలో ప్రవేశపెట్టడం ద్వారా యీ పరిస్థితిని నూతన ఆర్థిక యంత్రాంగంసమూలంగా మార్చి వేస్తోంది. యీ వ్యవస్థ, తుది ఫలితాలకు పరిశ్రమాది సంస్థలనే బాధ్యులను చేస్తోంది యీ తుది ఫలితాలు శ్రామిక ప్రజల పాదార్థిక సంక్షేమాన్ని ప్రతి ఒక్క కార్మికుని ఆదాయాలను నిర్ధారిస్తాయి. సామాజికీకరణ ప్రగాఢమౌతోందనీ, ఆస్తినానాటికీ సోషలిస్టు స్వభావం గలది అవుతోందని దీనర్థం. ఎందుకంటే యావన్మంది ప్రజల ఆస్తికి తానే యజమానినని ప్రతిఒక్క కార్మికుడూ భావిస్తాడు.

సోవియట్ ఆర్థిక వ్యవస్థలో చిన్న స్థాయి వుత్పత్తి, సహకార సంస్థలు, కుటుంబ, వ్యష్టిశ్రమ కార్యకలాపాలు కూడా చోటు చేసుకున్నాయి. యివి ప్రత్యేకించి వినిమయదారుల సేవల రంగంలో, చిల్లర వ్యాపారంలో, పౌర భోజనాల సరఫరాలో అంటే ప్రధాన ప్రభుత్వ సంస్థలు అసమర్థమైనవిగా, వాటికి లాభదాయకం కానివిగా రుజువైన రంగాల్లో ముమ్మరంగా అభివృద్ధి చెందుతున్నాయి. యెందుకంటే ప్రభుత్వ సంస్థలు ప్రతి ఒక్కరి పట్ల శ్రద్ధకనబర్చలేవు. యీ రంగంలో యెంత పెద్ద సంస్థలు ప్రవేశిస్తే నష్టాలు అంత యెక్కువ,పనినాణ్యత, సేవలు అంతనాసిగా వుండినాయి.

దీని ఫలితంగా సోవియట్ యూనియన్‌లో అక్రమ వ్యష్టిశ్రమ కార్యకలాపాల రంగం విస్తృతంగా తలెత్తింది: డిమాండ్‌తో పాటు సప్లయికూడా పెరుగుతుంది కదా. యీ పరిస్థితి యేవిధంగా చూసినా సానుకూల మైనదికాదు; యెందుకంటే దీనివల్ల ప్రభుత్వపర్మిట్లకు చెల్లింపులుగానీ, పన్నులుగానీ యేమి లభించలేదు. అదే సమయంలో ప్రభుత్వ నియంత్రణ లేనందున నాణ్యతపడిపోతుంది, ధరలు పెరిగాయి. యీ రంగంలో యిది వరకే వున్న వ్యష్టిశ్రమ కార్యలాపాలకు తత్సంబంధిత శాసనం ఒక చట్టబద్ధ ప్రాతిపదికను సమకూర్చి అలాంటి వుత్పత్తి రూపాల అభివృద్ధికి పరిస్థితులను సృష్టించింది. ఉదాహరణకు, ఈ శాసనాన్ని ఆమోదించక ముందు సోవియట్ యూనియన్‌లో **ప్రభుత్వ** పర్మిట్లపై 100,000 మంది వ్యష్టిశ్రమ కార్యకలాపాలను నిర్వహించారు. ఈ శాసనం అమల్లోకి వచ్చిన వెనువెంటనే మరో 300,000 మంది అలాంటి పర్మిట్లు పొందారు. మరో 200,000 మంది యిప్పుడు చిన్న చిన్న సహకారసంస్థల్లో పనిచేస్తున్నారు.

క్లుప్తంగా చెప్పాలంటే యీ చర్యలన్నీ మన దేశంలో తక్కువ సోషలిజం రూపుగొనే పరిస్థితికి దారి తీయలేదు.

# ఆరోగ్య సంరక్షణరంగంలో తొట్టతొలి సోవియట్ - పాశ్చాత్య సంయుక్తసంస్థ

యూరికానిన్

ప్రపంచరంగంలో సోవియట్ యూనియన్ ఆర్థిక కార్యకలాపాల్లో లోగడ మితిమీరిన కేంద్రీకరణ, బ్యూరాక్రాటిక్ పద్ధతులుండినాయి. యీ కార్య కలాపాలు సమూలంగా మారుతున్నాయి. తమవిదేశీ భాగస్వాములతో ప్రత్యక్ష సంబంధాలు పెట్టుకుంటున్న సోవియట్ పరిశ్రమాది సంస్థల సంఖ్య నానాటికీ పెరుగుతోంది.

స్విస్ కంపెనీ హొఫ్‌మాన్-లా రోశ్, "బయోటెక్నొలాజియా" పరిశోధనా సమ్మేళనం మాస్కోలో యేర్పాటు చేయతలపెట్టిన "డయాప్లస్" అలాంటి సంయుక్త పరిశ్రమల్లో ఒకటి. దీనికి సంబంధించిన పత్రాలపై సంతకాలు జరిగాయి. యీ చర్చలనూ, సంతకాల క్రమాన్నీ త్వరితం చేయడంలో సోవియట్ పక్షం యెంతో కృషి చేసిందని స్విస్ కంపెనీ కార్యవర్గ సభ్యులూ, ఈ కంపెనీకి చెందిన రోగనిర్ధారణ విభాగ అధ్యక్షుడు జి. జానెతి సోవియట్ మంత్రి వలేరీ బైకోవ్‌ను యీసందర్భంగా జరిగిన ఉత్సవంలో అభినందించారు. యీ ఒప్పందాన్ని సోవియట్‌లో జరుగుతున్న పునర్ వ్యవస్థీకరణ ప్రత్యక్ష ఫలితంగా భావిస్తున్నామని వారన్నారు. సోవియట్-స్విస్ సంయుక్త కంపెనీ అత్యున్నత నాణ్యతగల మందులను ఉత్పత్తి చేయగలదని, అందుకు తమ కంపెనీ హామీ యిస్తుందని వారు తెలియ జేశారు.

సోవియట్ యూనియన్‌లో యెర్పాటు చేస్తున్న సోవియట్-పాశ్చాత్య మొట్టమొదటి సంయుక్త వైద్యకంపెనీ యీ డయాప్లస్ అని మంత్రి వలేరిబైకోవ్ అన్నారు.

ప్రయోగశాలల్లో ఆధునిక పద్ధతుల్లో రోగ నిర్ధారణ చేసే చికిత్సా పద్ధతిని నియంత్రించే అవకాశాలు మెరుగు పడుతాయని యీ కంపెనీ డైరెక్టర్ జనరల్ వై.వైన్ బెర్గ్ అన్నారు. ఇందుకు అవసరమైన సాధనాలను, సామగ్రిని మాతృకంపెనీలు, సోవియట్ పరిశోధనా కేంద్రాలు సప్లయి చేస్తాయి. దీనికి సంబంధించి సోవియట్ పరిశోధకులకు ఎన్నో నూతన ఆలోచనలున్నాయి. ఉదాహరణకు సోవియట్ యూనియన్ పౌర ఆరోగ్య మంత్రిత్వ శాఖ ఆధ్వర్యాన గల ఇమ్యునాలజీ ఇనిస్టిట్యూట్ డైరెక్టర్ అకడమీషియన్ ఆర్. పెత్రోవ్‌నే తీసుకుందాం. ఎయిడ్స్‌ను కనుగొనడానికి సమర్థమైన పద్ధతిని కనుగొన్నందుకు, యీయనకు అంతర్జాతీయ బహు మతి లభించింది.

ఈ సంయుక్త కంపెనీ ప్రారంభనిధి సుమారు 10 మిలియన స్విస్ ఫ్రాంకులు (యిందులో 60 శాతం సోవియట్ పక్షానిది, 40 శాతం స్విస్ పక్షానిది). ప్రారంభంలో వైద్య పరికరాలను సోవియట్ ఆసుపత్రులకు, రోగ నిర్ధారణ కేంద్రాలకు యీ కంపెనీ సప్లయిచేస్తుంది. ప్రపంచ మార్కెటుకు కూడా త్వరలోనే నాణ్యమైన ఉత్పత్తులను యీ కంపెనీ సప్లయి చేస్తుంది.

# యూరప్ భద్రతకోసం వార్సాసంధి రాజ్యాల నూతన ప్రతిపాదనలు

జి. వాసిలియే.

మూడు ప్రధాన, రాజకీయ ఘటనలు సంభవించిన వెంటనే ప్రాచ్య శిబిర అత్యున్నత సంస్థ ఈ సంవత్సర సమావేశం జరిగింది. ఆఘటనలివి : మాస్కోలో జరిగిన సోవియట్-అమెరికా శిఖరాగ్ర సమావేశం, 19వ సోవియట్ కమ్యూనిస్టు పార్టీ సమావేశం, మిహాయిల్ గొర్బచేవ్ పోలెండ్ సందర్శన. అంతర్జాతీయ సంబంధాలను మానవతా పూరితం చేయడం, అణ్వాస్త్రరహిత, సురక్షిత ప్రపంచాన్ని నిర్మించడం అన్న యోచనకు తమ నిబద్ధతను సోషలిస్టు దేశాలు ఆసమావేశంలో తిరిగి ధ్రువీకరించడం సహజమే.

వార్సా సంధి రాజ్యాల నూతన చొరవల పై చర్చ, పోలెండ్ పార్లమెంటులో సోవియట్ నాయకుడు చేసిన ప్రతిపాదనలపై చర్చ కొనసాగుతున్నప్పుడే జరిగింది. సాంప్రదాయిక ఆయుధబలాల తగ్గింపుపై అఖిల యూరపియన్ దేశాల సమావేశాన్ని జరపాలని మిహయిల్ గొర్బచేవ్ అక్కడ సూచించారు సోవియట్, అమెరికన్ వ్యూహాత్మక ఆయుధాల్లో 50 శాతం తగ్గింపుపై సంధిని, సమస్త రసాయనిక ఆయుధాల నిషేధంపై ఒక ఒప్పందాన్నీ, సాంప్రదాయిక సాయుధ బలాల తగ్గింపుపై ఒక ఒడంబడికనూ చేసుకోవాలని రాజకీయ సంప్రతింపుల కమిటీ ప్రతిపాదించింది. యూరప్, యావత్ప్రపంచ భద్రతా ప్రయోజనాలకోసం అట్లాంటిక్ సముద్రంనుంచీ, ఊరల్స్ పర్వతాల వరకూ గల సాంప్రదాయిక సాయుధ బలాలను బాగా తగ్గించడం అవసరమని వార్సా సంధి దేశాలు నమ్ముతున్నాయి. ఈసమస్యపై చర్చలు ఈసంవత్సరాంతం నాటికల్లా ప్రారంభం కావాలి; ఈరెండు కూటములకూ ఆత్మరక్షణకు అవసరమైనంత సైనికబలాలు ఉండేలా వాటిని గణనీయంగా తగ్గించడంపై ఈసంప్రదింపులు కేంద్రీకరించాలి.

ఈ కర్తవ్యాలను మూడు దశల్లో నెరవేర్చవచ్చు. మొదటి దశలో వివిధ ఆయుధాలలోనూ, సాయుధ బలాలలోనూ, అసమానతలను, అంగనిర్మాణంలో తేడాలను తొలగించి ఉభయపక్షాలూ వాటి సమతూకాన్ని సాధిస్తాయి. అటువంటి సమతూక స్థాయిలు ఇప్పుడు ప్రతిఒక్క పక్షానికీ ఉన్న వాటిస్థాయికన్నా చాలా తక్కువగా ఉండాలి. రెండవదశలో ఉభయపక్షాలూ తమ సైనికుల సంఖ్యను 25 శాతం, లేదా 5 లక్షలమంది మేరకు తగ్గించాలి. మూడవదశలో ఉభయులూ తమ సాంప్రదాయక సాయుధ బలశక్తిని ఖచ్చితంగా ఆత్మరక్షణకు

అవసరమైన స్థాయికి తగ్గించాలి.

ఆకస్మిక దాడి ప్రమాదాన్ని తగ్గించి, తుట్ట తుదకు పూర్తిగా తొలగించవలసిన అవసరం కూడా ఉంది. ఈ లక్ష్యంతో ఉభయపక్షాలూ తమ కూటములు ఎదురుబధురుగా ఉన్న రేఖపొడుగునా గల ప్రాంతంలో అత్యంత ప్రమాదకరమైనట్టి, అస్థిరీకరించేటట్టి రకానికి చెందిన ఆయుధాల్ని తొలగించాలి. లేదా, కనీసం తగ్గించనైనా తగ్గించాలి. వీటి గురించిన సమాచారం ఒకరికొకరు తెలుపు కుంటూ ఉండాలని, జరిగిన ఏ ఒప్పందమైనా సరే పాటింపబడుతున్నదా అనే విషయాన్ని ఫలప్రదంగా తనిఖీచేసే వ్యవస్థ ఉండాలని ఈ ప్రతిపాదన నిర్దేశిస్తోంది. వ్యూహానికీ, ఎత్తు గడలకు సంబంధించిన వ్యవస్థలకు ఉద్దే శించిన అణుశీర్షాలతో సహా యెత్తుగడలకు సంబంధించిన అణ్వాయుధాలను గణనీయంగా తగ్గించాలనీ, తుదకు, పూర్తిగా తొలగించాలనీ మరో సంబంధిత ప్రతిపాదన నిర్దేశిస్తోంది.

ఒక్కముక్కలో చెప్పాలంటే సురక్షితమైన, హింసారహితమైన ప్రపంచస్థాపన వైపు గణనీయంగా, త్వరితగతితో పురోగ మించేందుకు ఈకొత్త ప్రతిపాదనలు అవకాశాలను కల్పిస్తున్నాయి.

వీటి ప్రాముఖ్యాన్ని గురించి ఎంత చెప్పినా అతిశయోక్తి కాదు. యూరపు రెండు సైనిక, రాజకీయ కూటాలు ప్రత్యక్షంగా ఒక దానినొ కటి ఎదురొడ్డి నిల్చున్న ప్రాంతం. అవి అక్కడ మిలియన్ల కొద్దీ సైనికులను, వేలకు వేలు టాంకులను, యుద్ధ విమానాలను, బ్రహ్మాండ మైన ఆయుధ గోదాములను ఉంచాయి.

మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల నిర్మూలనపై కుదిరిన సోవియట్-అమెరికన్ సంధి అమలు జరగడం అణ్వాస్త్ర రహిత ప్రపంచంవైపు వేసిన తొలి అంజ. నిరాయుధీ కరణ వాస్తవికతా దృష్టిగల కర్తవ్యమని అది నిరూపించింది. అదే సమయంలో, అది తర్వాత ఏమిటి అనే ప్రశ్నను లేవనెత్తింది. నాటో లోని యధాతధ వాదులు నిరాయుధీ కరణ క్రమాన్ని అడ్డుకొట్టడానికి ప్రమాదకరమైన కార్యకలాపాలు సాగిస్తున్నారు. ఐ.ఎన్.ఎఫ్ సంధి ననుసరించి మిసిలీలను తొలగించి నందువల్ల జరిగిన "నష్టానికి పరిహారం" కావాలని వారంటున్నారు. ఆ ఒప్పందం పరిధి లోకి రాని ఆయుధాలను ఆధునికీకరించాలని పట్టు పడుతున్నారు. వార్సా సంధి దేశాలకు, "సాంప్రదాయిక సాయుధ బలాలలో అమిత మైన ఆధిక్యత" ఉందని వారు గోల చేస్తున్నారు.

వాస్తవంలో ఈ రెండు కూటాల సాయుధ బలాల్లో అసమతలు, అంగనిర్మాణంలో భేదాలు ఉన్నమాట నిజం. ఉదాహరణకు, వార్సాసంధి కూటమికి ఎక్కువ టాంకులు ఉండగా నాటోకు ఎక్కువ యుద్ధ విమానాలు ఉన్నాయి. వివిధ మండలాలలో ఈ కూటాలు మోహరించిన సైనికుల సంఖ్యలో కూడా తేడా లున్నాయి.

యూరప్‌లో సోవియట్ సాయుధ బలాల ఆధిక్యతను గురించిన ఆరోపణ నిరాయుధీ కరణ క్రమానికి ఒక ఆటంకంగా చాలా సంవత్స రాలపాటు ఉపయోగపడుతూ వచ్చింది. ముఖ్యంగా వ్యూహాత్మక అణ్వాయుధాల్లో 50 శాతం కోత విధింపు క్రమానికి యివి ఆటంకం కలిగిస్తూ వచ్చాయి. పాశ్చాత్య దేశాల ప్రతి స్పందన నిర్మాణాత్మక మైనదని నిరూపితమైతే ఈ ఆటంకాన్ని తొలగించవచ్చు. ఈ అసమ తలూ అంగనిర్మాణ భేదాలను తొలగించ వచ్చు. ఈ రెండు కూటాల బలాలు కచ్చి తంగా ఆత్మరక్షణ స్వభావాన్ని సంతరించు కుంటాయి. ఈ ప్రతిపాదనల్లో అలపెట్టిన ఫలప్రదమైన తనిఖీ వ్యవస్థ వాస్తవాలను దాచిపెట్టడం, మోసం చేయడం లాంటివాటికి అవకాశం లేకుండా చేస్తుంది.

సోషలిస్టు దేశాలు తాము యేక పక్ష ఆధిక్యత లను కోరడం లేదనీ, ప్రతిదశలోనూ పూర్తి సమతూకం, సమానత ఉండేలా నిరాయుధీకరణ క్రమంలో అన్ని దశల్లోనూ పురోగమించడానికి తాము సిద్ధంగా ఉన్నా మని మరోసారి నిరూపించాయి.

మానవ విలువలు

# మానవ మాన్యత



సోవియట్ సమాజాభివృద్ధిలో వేధించే సమస్యలను గురించీ, ప్రతి మనిషీ దుష్ప్రవర్తనను తిప్పి కొట్టాల్సిన అవసరాన్ని గురించీ యూరి అరక్చెయేవ్ రాస్తున్నారు. ''పిరమిడ్'' అన్న నవల ఆయనకు కీర్తిని సంపాదించి పెట్టింది. అధికారుల నిరంకుశ చర్యల నుండీ మానవ హక్కులను కాపాడాల్సిన అవసరాన్ని ఆయన ఈనవలలో నొక్కి చెప్పారు.

ఉన్నత నీతి సూత్రాలు లేనిదే ఉన్నత సంస్కృతి గల సమాజం ఉండజాలదు. ఆదేశ పూర్వక ఏకగ్రీవత, స్వతంత్ర చర్యల పట్ల, స్వతంత్ర ఆలోచనలూ, ఉద్వేగాల పట్ల గౌరవ భావం లేక పోవడం — యివి సమాజంలో నైతిక విలువల స్థితిపై విధ్వంసక ప్రభావాన్ని కలిగిస్తాయి. మానవాళి యిప్పుడు రెండు ప్రపంచవ్యాప్త సమస్యల నెదుర్కొంటోంది: భిన్న తాత్వికతనూ, భిన్న భావ జాలాన్నీ ఎలా గౌరవించాలో నేర్చుకోవడం (లేకపోతే ఆత్మ విధ్వంసక ప్రమాదాన్ని ఎప్పటికీ అధిగమించలేము), జీవ్యావరణను రక్షించడం (లేకపోతే జీవ్యావరణ సంక్షోభంలో ఇరుక్కుంటాం). ఈ రెండు సందర్భాల్లోనూ ప్రతి ఒక్కరూ ఆత్మసాక్షిగా వ్యవహరించడం అవసరం.

నేడు, ''వ్యక్తిత్వస్వేచ్ఛ''తో సహా అనేక విలువలను మనం తిరిగి పరిశీలిస్తున్నాం. వాస్తవ జీవితంలో సంపూర్ణగ్లాస్నోస్ట్ లాగే సంపూర్ణ స్వాతంత్ర్యం కూడా అసాధ్యం. సంపూర్ణత ఎప్పుడూ నైరూప్యభావనే. అయినప్పటికీ, మానవుడు ఈ సంపూర్ణత కోసం పాటుపడుతున్నాడు. ఈ కృషి పవిత్రమైనదే గాక సమర్థనీయమైనది కూడా మన కోరికలతో యితరుల ప్రయోజనాలను కూడ పరిగణనలోకి తీసుకోవాలన్న మన విధిని మేళవించడం ఎలా? వ్యక్తి స్వేచ్ఛలకు పరిమితిని విధించే చట్టాలను సమాజం చేపడుతున్నది, సరిగ్గా యిందు కోసమే. చట్టాలు బహువిధమైనవని వేరే చెప్పనవసరం లేదు. హక్కులను ప్రకటించని చట్టం హక్కుల రాహిత్యాన్ని ప్రతిబింబిస్తుంది. ఎంత వరకూ సాధ్యమో అంతవరకూ స్వేచ్ఛగా ఉండే అవకాశాన్ని యిచ్చే చట్టం మాత్రమే న్యాయమైనది, మానవతా పూరిత మైనది, అందరూ శిరసావహించేది,

కచ్చితంగా పాటించబడేది. స్వేచ్ఛ అంటే, సాపేక్షికంగా విస్తృత యింగిత జ్ఞాన పరిధిలో స్వేచ్ఛ అని నేను చెప్పేదాని అర్థం.

సరళమైన ఈ భావం అంతకొత్తదేమీ కాదు; కానీ నాకదెంతో ముఖ్యమైనది. మనం ఒక కొననుండీ మరొక కొనకు వేగంగా వెడు తున్నాం. (అంటే చట్టాన్ని పరమోత్కృష్టమైనదిగా భావించడం నుంచీ దాన్ని అసలు నిరాక రించడం అన్న కొనకు వెడుతున్నాం). యిది అధికార దుర్వినియోగానికీ, భయాలకూ, అన్నిటిపైనా అపనమ్మకానికీ దారితీస్తోంది దీనంతటి వల్లా చట్టరాహిత్య పరిస్థితి ఏర్ప డుతోంది.

ప్రతి ఒకరూ పాటుపడాల్సింది మానవ అర్హతల సమానతకే. దస్తయేవ్‌స్కీ అభిప్రాయం యిదే. న్యాయమైనదిగా ఉండాలని కోరుకునే ఏ వ్యవస్థ అయినా, రాజ్యమైనా కట్టుబడి ఉండవలసిన రెండు షరతులివి విశ్వంలోని ప్రతి ఒక్కరి వ్యక్తిగత అంతస్సాక్షి, వ్యక్తిగత మాన్యత పవిత్రమైనవీ, అనుల్లంఘనీయ మైనవీను. అంతేకాదు. ఎవరి జీవితం వారిదే. అదెలా ఉండాలి అన్నది నిర్ణయించుకునే హక్కు వారిదే.

ఏ సమాజ నియమాలకైనా ఈ రెండు సూత్రాలు ప్రాతిపదికగా ఉండాలని నా అభిప్రాయం. వాటిని పాటించినట్లయితే వ్యక్తిపై విధించే పరిమితులు సమర్థనీయమైనవే. ఈ రెండు సూత్రాలను అచంచలంగా పాటించడం వల్ల మనిషి భయం నుండి, పరాధీనతనుండి అవమానింపబడే స్థితినుండి విముక్తుడవుతా డు. యిది రాజ్యాధికార ఆరాధనకు లోనుకా కుండా టీకా వేయడం వంటిది. ఉదాత్తమైన భావాలచే ప్రేరితుడైనట్టు చెప్పుకుంటూనే, ఆచరణలో వాటిని స్వలాభానికి మాత్రమే వినియోగించే నియంత చేతుల్లో ప్రజలను కీలు బొమ్మలుగా ఆ అధికార ఆరాధన మార్చవచ్చు. న్యాయ విచారణా పద్ధతులలో కొన్ని ప్రజాతంత్ర సూత్రాలను కచ్చితంగా పాటించ వలసిన అవస రాన్ని మిహయిల్ గోర్బచేవ్ నొక్కి చెప్పారు. ఆ సూత్రాలివి: అన్ని పక్షాల మధ్య పోటీ, సమానత; గ్లాస్నోస్త్, బాహాటత; ఎవరినైనా నరే "దోషిగా" తీర్పు చెప్పడంలో పక్షపాతానికి తావు లేకుండా చేయడం; నిందితుడు నిర్దోషి అన్న భావనతో విచారణ ప్రారంభించాలనే సూత్రాన్ని అమలు జరపడం.

సోషలిస్టు భావజాలం అసమ్మతి హక్కు నిరాకరణపై ఎన్నడూ ఆధారపడలేదు.వాస్త వంలో అది తద్విరుద్ధంగానే ఉంటూ వచ్చింది. నానారకాల నిషేధాలతో కూడిన ఏకవ్యక్తి నిరంకు శాధికారంపై పెల్లుబికిన ద్వేషమే రష్యాలో గొప్ప విప్లవోద్యమాలన్నిటినీ ప్రేరేపించింది. మన విప్ల వం కృతకంగా పరిపక్వమైనది కాదు. కాని, కష్టభూయిష్టమైన పోరాటం కారణంగా, బోల్షివి క్కులు ఏకవ్యక్తి పాలన వైపు, కచ్చితమైన క్రమ శిక్షణ, ఏకాభిప్రాయంవైపు, ముఠాలకు వ్యతిరేక మైన రాజీలేని పోరాటం వైపు మొగ్గక తప్పలేదు. తుదకు, ఒక్క వ్యక్తి చేతిలో అపారమైన అధికారం కేంద్రీకృతమైంది. పైపెచ్చు లెనిన్ హెచ్చరించి నట్టు ఆవ్యక్తి తన భాద్యతకు అంతగా తగిన వ్యక్తికాదు.

దీని ఫలితాలు మనకిప్పటికీ అనుభూతమవు తున్నాయి. కరుడుగట్టిన పరిపాలనా వ్యవస్థ ఇప్పటికీ ఉంది.

ఏనాయకుడైనా తప్పు చేయవచ్చు. కొత్త రక్తమెక్కించడం దాన్ని సరిదిద్దడానికి అవసరం. గ్లాస్నోస్త్, సత్యం, మానవుని మాన్యత పట్ల గౌరవం. ప్రజాస్వామ్యం గల వాతావరణం దీనికి తప్పనిసరి. పార్టీ 27 వ మహాసభ సరిగ్గా ఈ ప్రశ్నలనే లేవనెత్తింది. మన సమాజంలో ప్రజాస్వామ్యం సర్వసమగ్రంగా అభివృద్ధి కావడానికి, గ్లాస్నోస్త్‌ను. సోవియట్ మానవుని మాన్యతను పెంచడానికి కావలసిన న్యాయపరమైన, రాజకీయమైన యంత్రాంగాన్ని రూపొందించేందుకు 19 అఖిల యూనియన్ పార్టీ సమావేశ ఫలితాలు త్వరలో తోడ్పడ తాయని ఆశిస్తున్నాము. దీనికి ఎంతకాలం పడుతుందనేదే యిప్పుడున్న ప్రశ్న అని నా అభిప్రాయం.

# అలీన ఉద్యమం: నిష్పాక్షిక దృక్పథం

సెర్గీ సినీత్‌సిన్,

*సోవియట్ విదేశాంగ వ్యవహారాల మంత్రిత్వశాఖలో అలీనోద్యమ వ్యవహారాల విభాగ అధిపతి.*

విజయవంతమైన జాతీయ విముక్తి ఉద్యమ వెల్లువ ఫలింతంగానేమి, సామ్రాజ్యవాద వర్గాలు ఆ వెల్లువ వచ్చిన కాలంలోనే ప్రారంభించిన ప్రాక్-పశ్చిమ ప్రచ్ఛన్న యుద్ధ ఫలితంగానేమి అలీనోద్యమ సిద్ధాంతం ఆవిర్భవించింది. 1961 సెప్టెంబరులో 25 అలీనోద్యమదేశాల నాయకుల ప్రథమ సమావేశం జరిగింది. ఆతరువాత ఈ ఉద్యమ పురోగమనంలోని వివిధ దశల్లో దాని ప్రాథమ్యాలు మారుతూ వచ్చినప్పటికీ, దాని ధ్యేయాలు, సూత్రాలు స్థిరంగా వున్నాయి. భిన్నత్వంలో ఏకత్వాన్ని, ఈ విశిష్ట ఉద్యమ ప్రతిష్ఠనూ పదిలంగా వుంచడానికి వీలు కల్పించినది, ఈ ధ్యేయాలూ, సూత్రాలే

అగ్రరాజ్యాలపట్ల "సమానదృక్పథం" అనుసరించాలనీ, ప్రపంచ ఉద్రిక్తతల విషయంలో రెంటికీ "సమానబాధ్యత" వుందనీ వర్ధమానదేశాల ఆర్థిక చిక్కులకు రెండూ కారణమనీ పాశ్చాత్య వర్గాలు ప్రచారం చేస్తున్న భావన, అలీనోద్యమంలో కూడ బాగా వ్యాప్తిలో వుంది. వాస్తవ పరిస్థితులపై ఆధార పడిన మన అభిప్రాయం వేరనేది జగద్విదితం. అనేక ప్రముఖ పాశ్చాత్య రాజ్యాల వలెకాక, సోషలిస్టు రాజ్యాలకు, వర్ధమాన దేశాలతోనూ, అలీనోద్యమంతోనూ గల సంబంధాలు వలస వాదంనుంచి సంక్రమించినవి కాదు. అత్యధిక అలీనదేశాల దయనీయస్థితికి కారణం, ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థలు, వాటి అసమస్థానమూ, పాశ్చాత్యదేశాలకు, వాటి బ్యాంకులకు, అంతర్జా తీయ ద్రవ్యసంస్థలకు ఈదేశాలు చెల్లినచాల్సిన ట్రిలియన్ డాలర్ల రుణమూను.

మరో విషయం కూడ చాలాముఖ్యమైనది. ప్రస్తుతం అంతర్జాతీయ సమస్యల పట్ల అలీన దేశాల వైఖరికి, పాశ్చాత్యదేశాల వైఖరితో కన్న సోషలిస్టు దేశాల వైఖరితో ఎక్కువ పొత్తుంది. ఉదాహరణకు, ఐక్యరాజ్యసమితి ఈ విషయాలపై తీర్మానాలను ఆమోదిస్తున్నప్పుడు, 80 శాతం తీర్మానాల విషయంలో అలీనదేశాలు సోషలి స్టుదేశాలతో ఏకీభవిస్తూ ఓటుచేస్తున్నాయి.

అలీనోద్యమ హరారే రాజకీయ ప్రకట నపట్ల అమెరికా అసంతృప్తిని అర్థం చేసు కోవచ్చు. దానిలో అమెరికాను విమర్శిస్తూ 54 సార్లు ఆ దేశాన్ని పేర్కొన్నారు. కాని సోవియట్‌యూనియన్‌ను విమర్శించిన సంద ర్భం ఒక్కటికూడ లేదు. దీనర్థం అగ్రరాజ్యాల్లో

ఒకదాని విధానాల్లోని నిర్దిష్ట అంశాల గురించి అలీనోద్యమ అంచనాయే తప్పు మరో అగ్రరాజ్య ప్రయోజనాలకు, లక్ష్యాలకు దన్ను ఇవ్వటం కాదు. వాస్తవంలో ఉన్న పరిస్థితి అది. కాని అలీనోద్యమం తన సూత్రాలనుంచి వైదొలగిందని కాని, "నిజమైన" అలీనోద్యమ విధానాన్ని ఉల్లంఘించిందని కాని చెప్పడానికి ఇది దృష్టాంతం కాదు. అలీనోద్యమం రెండు అగ్ర రాజ్యాలకు "సమానదూరం" లో వుండాలన్న సూత్రాన్ని ఆ ఉద్యమంలోని అనేక దేశాలు అంగీకరించడంలేదు. ఇది ప్రపంచ వ్యవహారాల్లో అలీనోద్యమాన్ని క్రియాశూన్య స్థితికి నెట్టడానికీ, శాంతి శక్తులతో దాని సహకారాన్ని అడ్డుకొట్టడానికీ చేసే ప్రయత్నమని అవి భావించడం సరియైనదే.

2000వ సంవత్సరం నాటికి అన్ని అణ్వాస్త్ర రాజ్యాలు అణ్వాయుధాలను నిర్మూలించాలన్న సోవియట్ ప్రతిపాదనను హరారే ప్రకటన ప్రశంసిస్తూ, ఈ సమస్యపై అలీనదేశాల దృక్పథానికి ఈ ప్రతిపాదన అనుగుణంగా వుందని ఉద్ఘాటించింది. ఇలా చెప్పడమంటే, సోవియట్‌యూనియన్, అలీనోద్యమం వీటి దృక్పథాల్లో తేడాలు లేవని అర్థం కాదు. అంతర్జాతీయ ఉద్రిక్తతలకు మూలకారణాలు, నిరాయుధీకరణలోని పలు అంశాలు, ఆఫ్ఘనిస్తాన్, కంపూచియా వంటి ప్రాంతీయ ఘర్షణలు వంటి విషయాల్లో సోవియట్ అంచనాకు, అలీనోద్యమం అంచనాకు మధ్య భేదంవుంది. అయితే, ఈ విభేదాలు నేటి అంతర్జాతీయ సమస్యలపై అలీనోద్యమంతో సహకారానికి ఆటంకమనీ మనం భావించడంలేదు.

సోవియట్ యూనియన్ ఆంతరంగిక, విదేశాంగ విధానాల పునర్వ్యవస్థీకరణ దృష్ట్యా, అలీనోద్యమం పట్ల ఆ దేశదృక్పథంలో కొన్ని మార్పులు వచ్చాయని రూఢిగా చెప్పవచ్చు. అలీనోద్యమం పట్ల సోవియట్ మొదటినుంచి అవలంబిస్తూన్న సూత్రబద్ధ సంఘీభావ వైఖరిలో మార్పులేదు. కాని, దాన్ని మరింతగా అవగాహన చేసుకుంటుంది. దాని పాత్రను విశాలదృష్టితో చూస్తుంది.

మొదటి విషయం. అలీనోద్యమాన్ని ప్రపంచ రాజకీయాల్లో ఒక స్వతంత్ర శక్తిగా గుర్తిస్తున్నామని సోవియట్‌యూనియన్ నిర్ద్వంద్వంగా ప్రకటించింది. ఆ ఉద్యమ సంస్థాపక సూత్రాలపట్ల, సైనిక కూటాల్లో పాల్గొన కూడదన్న దాని విధానంపట్ల తన గౌరవభావాన్ని ప్రత్యేకించి నొక్కిచెప్పింది. రెండవ విషయం, ఆ ఉద్యమ కార్యకలాపాల సామ్రాజ్యవాద వ్యతిరేక స్వభావం యెంత ముఖ్యమైనదో గుర్తించడంతోపాటు, దాని ప్రజాస్వామిక, శాంతిస్థాపక కృషి ప్రాముఖ్యాన్ని కూడ సోవియట్ యూనియన్ ప్రకటనలు నొక్కి చెబుతున్నాయి. ఈ కృషి అలీనరాజ్యాలలోని విస్తృత విభాగాల అండను సంపాదించింది; ప్రపంచ సమస్యల పరిష్కారంలో ఈ ఉద్యమం మరింత విస్తృతంగా పాల్గొనడానికి తోడ్పడుతోంది.. ఆఖరు విషయం. అలీనోద్యమాన్ని తాను ప్రాక్-పశ్చిమ సంబంధాల దృష్ట్యా చూడటంలేదనీ, స్వీయ అభివృద్ధి పథాన్ని ఎంచుకొనేందుకు ప్రతి ప్రజకు గల హక్కును గౌరవిస్తున్నాననీ సోవియట్ యూనియన్ స్పష్టంగా ప్రకటించింది.

పేర్కొనదగిన మరోవిషయం కూడవుంది. అలీనోద్యమం, సోవియట్ యూనియన్, ఈ రెండూ "సహజబంధువులు" అన్న భావన సోవియట్ విద్వాంసుల్లోనూ, పాత్రికేయులలోనూ వ్యాప్తిలో వుండేది. ఇప్పుడు ఆ సూత్రీకరణ వదలివేయబడింది. ఐరాస లో అలీన, సోషలిస్టు దేశాల వైఖరుల సామీప్యతపై ఆధారపడిన ఈ సూత్రీకరణ అనేక అలీన దేశాలకు రుచించలేదు. పైగా ఇది అలీనోద్యమం పట్ల సోవియట్ దృక్పథ వాస్తవ స్వభావాన్ని వక్రంగా చిత్రిస్తుంది.

సోవియట్ వైఖరిలోని అంశాలకు కొత్తగా ఇచ్చిన ఈ ప్రాధాన్యంవల్ల, అలీనోద్యమంలో పలుకుబడి గలిగిన భారతదేశం, యుగొస్లావియా, అల్జీరియాలతోసహా, అనేక భాగస్వామ్య దేశాలకూ, సోవియట్‌యూనియన్‌కూ మధ్య పరస్పర అవగాహన పెంపొందింది. గత కొద్ది సంవత్సరాలుగా అంతర్జాతీయ రంగంలో అలీనోద్యమంతో మన సహకారం బాగా వృద్ధిచెందింది. 1986

# అలీన ఉద్యమం: నిష్పాక్షిక దృక్పథం

నవంబరులో మిహయిల్ గోర్బచేవ్ భారత సందర్శన, అక్కడ సంతకాలు జరిగిన ఢిల్లీ ప్రకటన, సోవియట్, యుగొస్లావియా ప్రకటన —యివి అలీనోద్యమంతో మన సంబంధాల నిజస్వభావానికి దర్పణాలు.

అగ్రరాజ్యాల మధ్య సంబంధాల్లో వస్తున్న పరిణామం అలీనదేశాల్లో కొన్ని భయాందోళనలను రేకెత్తిస్తూందన్న వాస్తవాన్ని ఉపేక్షించలేము. అగ్రరాజ్యాలమధ్య ''రాజీ' వర్ధమాన దేశాలకు ''నష్టకరంగానూ,'' వాటి జాతీయ, మండల ప్రయోజనాలకు హానికరంగానూ జరగవచ్చుననే భయాన్ని అలీనదేశాలు వ్యక్తం చేస్తున్నాయి. ఉదాహరణకు, నిరాయుధీ కరణపై సోవియట్-అమెరికా ఒప్పందాలు అలీనోద్యమంలో ''మితవాదంవైపు మొగ్గులకు'' దారితీయ వచ్చునని కొందరంటున్నారు. వాటి సామ్రాజ్యవాద వ్యతిరేక, వలన వాద వ్యతిరేక కార్యకలాపాలపై ప్రతికూల ప్రభావం నెరవుతాయని, జాతీయ విముక్తి పోరాటాన్ని కుంటు పరుస్తాయనీ చెబుతున్నారు. ఈ అవగాహన పూర్తిగా తప్పని ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. జాతీయ విముక్తి కోసం దేశ దేశాల ప్రజలు చేసే పోరాటాన్ని బలపరచడం తన సూత్రబద్ధవిధి అని సోవియట్ యూనియన్ భావం. వర్ధమానదేశాలు గురి అవుతున్న నయావలసపీడన, వాటిపై సామ్రాజ్యవాదులు తెస్తున్న ఒత్తిడి అలీనోద్యమం చేపట్టిన సామ్రాజ్యవాద వ్యతిరేక కార్యకలాపాలు కొనసాగడానికి వస్తుగత ప్రాతిపదికగా వున్నాయి. ప్రపంచ సమస్యలపట్ల అలీనోద్యమం మరింత శ్రద్ధ వహించడం, అది మితవాదంవైపు గాని, వామపక్షం వైపుగాని మొగ్గడం లేదనడానికి సాక్ష్యం. పైపెచ్చు ఆ ఉద్యమం మరింత నిర్మాణాత్మకంగా, బాధ్యతాయుతంగా, వ్యవహరిస్తూందనే దానికి అది సూచన.

ప్రపంచంలో వస్తున్న సానుకూల పరిణామాలను దృష్టిలో వుంచుకొని, అలీనదేశాలు అగ్రరాజ్యాలతో కలిసి ప్రపంచ సమస్యలను పరిష్కరించే కృషిలో మరింత క్రియాశీలంగా పాల్గొనే నిర్దిష్ట మార్గాలను అన్వేషిస్తున్నట్లు స్పష్టమవుతూంది. అందుకు తమ సొంత ప్రతిపాదనలు చేస్తున్నాయి. అణ్వస్త్ర విసర్జనలో కొంత ప్రగతి సాధించిన ఈనాడు, అలీనోద్యమం వర్ధమాన దేశాల తక్షణ ఆర్థిక సమస్యలకు ప్రాముఖ్య మివ్వవచ్చునని, ఆ ఉద్యమ సభ్య దేశాల్లో కొన్ని చెబుతున్నాయి.

## సామాజిక-ఆర్థిక మనుగడ

వర్ధమానదేశాలకు ఒక భయంకర సమస్య అయింది. అణ్వస్త్ర సమస్యతోపాటు ఇదీ మానవాళి భవిష్యత్తుకే ముప్పుతెచ్చే ప్రపంచ సమస్య స్వభావాన్ని సంతరించుకొంది. మొత్తం ప్రపంచ దేశాలన్నీ కలిసి, నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ స్థాపనద్వారా మాత్రమే దీన్ని పరిష్కరించగలవు. ఐతే, ఈ లక్ష్యాన్ని మనం అణుప్రళయాన్ని నివారించి, నిరాయుధీకరణ దిశలో పురోగమించేందుకు జరిగే కృషితో సంబంధం లేకుండా సాధించజాలం.''అభివృద్ధికోసం నిరాయుధీకరణ''అన్న సూత్రాన్ని అమలు పరచేందుకు బాటవేసేది ఈ క్రమమే. అందువల్లనే ఈ రంగంలో అలీనోద్యమ కృషికి నేడూ, ఇకముందూ ఎంతో ప్రాముఖ్యముంది. అలీనోద్యమం అణ్వస్త్ర వ్యతిరేక, యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలే, నేటి ప్రపంచంలో దాని పాత్రకు అంతప్రాముఖ్యమిస్తున్నాయి. కాబట్టి ఈ కార్యకలాపాల ప్రాముఖ్యాన్ని తక్కువ చేసి చూపడం, ఆ ఉద్యమాన్ని ''రాజకీయాల నుంచి వేరుచేయడం'' అంటే వాని ప్రతిఫలను దెబ్బతీయడమేకాక, తక్షణ ఆర్థిక సమస్యల పరిష్కారానికై అలీన దేశాలు చేస్తున్న ప్రయత్నాలను అడ్డుకొట్ట

డమే కాగలదు.

పరస్పరాధారమూ, అఖండమూ అయిన నేటి ప్రపంచంలో, నిరాయుధీకరణ క్రమం వల్ల అలీన దేశాల దృక్పథం కొత్త లక్షణాలను సంతరించుకోవడం అనివార్యం. సోవియట్ యూనియన్, అమెరికాలు ఒప్పందాలు కుదుర్చుకొనే క్రమాన్నీ అణ్వస్త్ర పరీక్షల నిషేధం, దూరరేదసి నిస్సైనికీకరణ వంటి వాటినీ బలపరచడంతోపాటు అలీనదేశాలు ఇతర అణ్వస్త్ర దేశాల అణ్వస్త్ర విసర్జన సమస్యపట్ల మరింత శ్రద్ధవహించాలి. అణ్వస్త్ర వ్యాప్తి నిరోధం, సంప్రదాయక ఆయుధాల తగ్గింపు వంటి సమస్యల పరిష్కారంలో మరింత క్రియాత్మకంగా పాల్గొనాలి. అణ్వస్త్రాల విసర్జనక్రమం జయప్రదంగా పురోగమించడం, అట్లాంటిక్ నుండి ఉరల్స్ వరకు గల భూభాగంలో రెండు ప్రధాన సైనిక-రాజకీయ కూటాలు సాంప్రదాయిక ఆయుధాలను తగ్గించడం జరిగినట్లయితే, ప్రపంచంలోని ఇతర ప్రాంతాల్లో సాంప్రదాయిక ఆయుధాల ప్రాముఖ్యం భవిష్యత్తులో పెరుగుతుంది. అక్కడ ఆధునిక ఆయుధాల పోటీ, ఇరాన్-ఇరాక్ యుద్ధం నిరూపిస్తున్నట్లు, విపరీతమైన, జననష్టానికీ, అభివృద్ధికై వాడవలసిన వనరుల దుర్వినియోగానికీ దారి తీస్తుందే తప్ప ఏ రాజకీయ, సైనిక ఫలితాలూ ఇవ్వదు. కాబట్టి కనీసం విస్ఫోటన ప్రాంతాల్లోనైనా ఆయుధాలను పోగుచేయటం కాక, వాటి, సమతూకాన్ని తక్కువ స్థాయికి తెచ్చే సమస్యను తృతీయ ప్రపంచదేశాలు పరిశీలించవలసిన సమయం ఆసన్నమయింది.

రానున్న సంవత్సరాల్లో అంతర్జాతీయ ఆర్థిక సంబంధాల పునర్వ్యవస్థీకరణ అలీనోద్యమ కార్యకలాపాల్లో ఒక ముఖ్యస్థానం వహిస్తుందనడంలో సందేహంలేదు. ప్యాంగ్యాంగ్‌లో 1987 లో జరిగిన వర్ధమాన దేశాల మంత్రుల సమావేశం నిరూపించి నట్లు, దక్షిణ-దక్షిణ సహకారపరిధిలో, వాటి మధ్య ఆర్థిక సంబంధాల విస్తరణ అంతకన్నా కూడ ఎక్కువ ప్రాముఖ్యమున్న విషయం. విదేశీరుణం అతితీవ్రమైన సమస్యగా ఉండబోతుంది. ఈ సమస్యను రుణదాతల, రుణగ్రహీతల ద్విపక్షసంబంధాల రంగంనుండి తప్పించి ఒక అంతర్జాతీయ సమావేశంలో చర్చకు పెట్టడం అవసరం. అందుకుగాను అలీనదేశాలు ఈ సమస్య పరిష్కారంపట్ల తమదృక్పథాలను సమన్వయ పరచుకోగలగాలి.

## అలీన ఉద్యమం: నిష్పాక్షిక దృక్పథం

అలీనదేశాల సరిహద్దువివాదాల, ప్రాంతీయ ఘర్షణల, ప్రత్యేకించి తాము కూడ భాగస్వాములుగా వున్న ఘర్షణల పరిష్కారం పట్ల అవి తగినంత శ్రద్ధ వహించలేదు. అలీనోద్యమ సభ్యదేశాలమధ్య, దీనిపట్ల గల భిన్నవైఖరుల వల్ల, వాటిపరిష్కారం అలీనోద్యమానికి ఎంత కష్టమో ఇరాక్-ఇరాన్ ఘర్షణ నిరూపిస్తోంది. ఆసియా, పసిఫిక్ విశాల మండలంలో భద్రతా, సహకారాలు—యివి అలీనోద్యమం జాగ్రత్తగా పరిశీలించవలసిన మరోసమస్య

ఆఖరున ఢిల్లీప్రకటనలోని కిందిమాటలను ఉటంకించదలచాను: "ప్రపంచం అఖండమైనది. దాని భద్రత అవిభాజ్యం. సామాజిక వ్యవస్థలు, భావజాలాలు, మతంలేదా నరవర్గం—వీటితో నిమిత్తం లేకుండా ప్రాక్ పశ్చిమాలు, ఉత్తర దక్షిణాలు నిరాయుధీకరణకు ఉమ్మడిగా నిబద్ధం కావడంలో చేతులు కలపాలి...."

(మెజ్దునరోద్నయా జీజ్న్)



# స్టాలిన్, ఆయన వ్యక్తిపూజ మూలాలు

[illegible]

ప్రశ్న: స్టాలిన్ వ్యక్తిత్వం, ఆయన సహచరులు, సోవియట్ సమాజకాలంలో "వ్యక్తి పూజాదశ" అని మనం పేర్కొంటున్న రోజులు - ఇవి ప్రత్యేకించి గత కొద్ది సంవత్సరాలుగా మీరు పరిశోధిస్తున్న విషయాలని నాకు తెలుసు. మీ ఉపన్యాసాలు, ఎంతో ఆసక్తిని రేకెత్తించాయి. ఈ ఆసక్తికి కారణమేమి?

**జవాబు:** గతానుభవం నుండి మనం ఉపయోగించుకోవలసిన దేదో, తోసిపుచ్చవలసిన దేదో మనం తెలుసుకోవలసింది, చరిత్రనుంచీనే. ఈ రెంటికీ కూడ చరిత్ర సంపూర్ణ గ్రంథంగానే వుండాలి. అందులో కొన్ని పుటలు ఖాళీగా వుండరాదు. అప్పుడు మాత్రమే అది ఉపయోగకరంగానూ, విషయ బోధకంగానూ వుంటుంది. సోవియట్ చరిత్రలోని విషాదకర ఘటనలపై వివిధ తరాల ప్రజలు నేడు ఆసక్తి చూపడం సహజమే. స్టాలిన్‌ను, ఆయన కాలాన్ని గురించి భిన్నమైన, కొన్ని సందర్భాల్లో పరస్పర విరుద్ధ

మైన అంచనాలున్న మాట కూడనిజం.

కొందరి దృష్టిలో స్టాలిన్ క్షమించరాని రాజకీయనేరాలు చేసిన వ్యక్తి, ఇతరుల దృష్టిలో ఆయన విప్లవాన్ని వృత్తిగా చేపట్టిన విప్లవకారుడూ, లెనిన్ సహచరుడూ, "ఎన్నో తప్పులు చేసినా, యుద్ధంలో విజయం సాధించిన" యోధుడున్నూ.

స్టాలిన్ కాలాన్ని స్పష్టంగా అర్థం చేసుకోవడం ముఖ్యమని నా అభిప్రాయం. అందువల్ల ఆ శకం ప్రధానలక్షణంతో ప్రారంభిస్తాను. దాన్ని స్టాలిన్ శకం అనడం అంత సరికాదను కొండి. అనాడు, మొదటిసారిగా ప్రపంచంలో సోషలిస్టు రాజ్యం నిర్మాణమవుతూ వచ్చింది. అదికొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో జరిగింది. రాజకీయ నాయకుడుగా స్టాలిన్, దేశంలోని సమస్త క్రమాలను నడిపించే సూత్రాలను తన చేతిలో వుంచుకొన్నారు. స్టాలిన్ వ్యక్తిత్వాన్ని అంచనా వేయడానికి మనం ఈ విషయాన్ని ప్రాతిపదికగా చేసుకోవాలి.

1930 లో సోవియట్ యూనియన్‌లో నిరుద్యోగాన్ని నిర్మూలించారు. దేశం పటిష్ఠమైన పారిశ్రామిక రంగాన్ని నిర్మించింది. నిరక్షరాస్యతను తుడిచి పెట్టారు. కొత్త తరహా సంస్కృతి వృద్ధిపొందుతూ వచ్చింది. 40 జాతులకు తమ సొంత లిఖిత భాషలూ, సొంత మేధావి వర్గం చేకూరాయి. నాటి ప్రభుత్వం శత్రువర్గాలున్న సమాజానికి అసాధ్యమయిన సామాజిక సమస్యల పరిష్కారానికి మొదటిసారిగా పూనుకొంది. ఎన్ని వైపరీత్యా లున్ననప్పటికీ, సోషలిజం కోసం ప్రజలు అన్నిటినీ భరించి, అధిగమించారు. అవి బ్యూరాక్రటిక్ హుకుందారీ వ్యవస్థ ఫలితాలు. ఒక మనిషికి మాత్రమే చోటున్న పిరమిడ్ శిఖరం లాంటిదా వ్యవస్థ.

ప్రశ్న: తన సహజ గుణగణాలన్నిటితో స్టాలిన్, రంగంపైకి రావడం ఆయన శకం సహజసిద్ధ పర్యవసానమా?

జ: ఇదిచాలా ముఖ్యమైన ప్రశ్న సోవియట్ విషయాల బూర్జువా పరిశోధకులు తరచు దీన్ని సులభీకరిస్తున్నారు. స్టాలిన్ లేనట్లయితే మరొవ్యక్తి రంగంపైకి వచ్చి వుండేవాడు, కాని ప్రభుత్వ పద్ధతులు, హుకుందారీ పాలన అదే విధంగా వుండేవే, అని వారివాదన. ఆ శకం మూలంగానే స్టాలిన్ లాంటి నాయకుడు అనివార్యంగా అవసరమయాడని నేననుకోవడంలేదు. చరిత్ర ప్రతి మలుపులోనూ, వివిధ ధోరణుల మధ్య ఘర్షణ, వాటిలో ఒకదాన్ని ఎంచుకొనే అవకాశం ఉంటుంది. అనేక ప్రత్యామ్నాయాల్లో చరిత్ర ఒక దాన్నే ఎంచుకొంటుంది. శోచనీయమైన దేమిటంటే, అది ఎల్లప్పుడూ అత్యుత్తమ యినదే అనలేము. అప్పుడు చరిత్ర వంకర టింకరగా సాగుతుంది. కాని వస్తుగత నియతి చారిత్రక క్రమాన్ని మళ్ళీ ప్రధాన మార్గానికి తీసుక రాక తప్పదు.

ప్ర: లెనిన్ తరువాత స్టాలినే, ఎంచుకోవలసిన వారితో అత్యుత్తముడని కొందరంటారు. ఎందు వల్లనంటే, ట్రాట్‌స్కీ, జినోవ్యవ్, కామెనేవ్, బుఖారిన్ లలో ఎవరికీ యుద్ధ విధ్వంసితమైన దేశాన్ని పునరుద్ధరించి, సోషలిజాన్ని నిర్మించడానికి కావలసిన రాజకీయనైపుణ్యమూ, సంకల్పబలమూ లేవని వారి వాదం.

జ: అలా వాదించేవారు ప్రత్యామ్నాయాలను పరిమితం చేసి చూపుతుంటారు — స్టాలినో, లేక ట్రాట్‌స్కీయో. కాని ఆనాడు సమస్య అలాలేదు. ట్రాట్‌స్కీ ఏకైక, లేక ప్రధాన నాయకుని స్థానానికై పోటీ పడేందుకు తగిన పరిస్థితులు లేవు.

ఇక కామనేవ్, జినొవ్యేవ్‌ల సంగతి లెనిన్ మరణానంతరం తాము నాయకులమవుతామని వారనుకొని వుండవచ్చు స్టాలిన్ తమ వంటి హోదాతోనే అర్గనైజర్‌గా వుంటారనీ, రాజకీయ, మేధానాయకత్వ తమకే వుంటుందనీ వారు' భావించి వుండవచ్చు.

ఉత్తరోత్తరా అవకాశాలున్నది, ఫ్రుంజ్, ద్జెర్జిన్‌స్కీ, కిరోవ్‌లకు. కాని, కిరోవ్ మరణానంతరం వాతావరణం పూర్తిగా మారిపోయింది. ఇక ఎవరిపేర్లూ ముందుకు రాలేదు. 1940 లలోని ఆఖరు సంవత్సరాల్లో కేంద్రకమిటీ కార్యదర్శుల్లో ఒకరైన అలెగ్జీ కుజ్నెత్సోవ్ నాయకుడు

# స్టాలిన్, ఆయన వ్యక్తిపూజ మూలాలు

కావచ్చుననే అభిప్రాయం ఉండేది. కాని అది చాలా కొద్దిమంది అభిప్రాయమే.

కొన్ని సందర్భాల్లో ఒక ప్రశ్నవేస్తున్నారు లెనిన్ నిర్దిష్టంగా తన వారసుణ్ణి ఎందుకు పేర్కొనలేదు? లెనిన్ జీవితాన్ని ఆయన రచనలను అధ్యయనం చేసినప్పుడు, అటువంటి చర్య ఆయన స్వభావానికే విరుద్ధమని అర్థమవుతుంది. స్టాలిన్‌కుగల లోపాలు లేనటువంటి తగినంత పేరు, ప్రఖ్యాతులున్న నాయకుడు దేశాన్ని నడిపించాలని లెనిన్ అభిప్రాయం. అటువంటి వ్యక్తి నాయకత్వ పారంపర్యతకు, సమిష్టి స్వభావానికి హామీగా వుండటం ముఖ్యమని లెనిన్ భావించారు.

ప్ర: ఒక్కవ్యక్తి చేతుల్లో అధికారకేంద్రీకరణ తీవ్ర సమస్యలకు దారితీయవచ్చునని లెనిన్‌కు తెలిసే వుంటుంది.

జ: ఔను, లెనిన్‌కు అలాంటి భయాలుండేవి. పార్టీ అనుసరించే శ్రామికవర్గపు విధానాన్ని నిర్ణయిస్తున్నది, పార్టీ పాతకాపులనదగిన చాలా చిన్న బృందానికున్న బ్రహ్మాండమైన, అమితమైన అధికారమే తప్ప పార్టీ సభ్యత్వ రూపంకాదని లెనిన్ 1922 మార్చిలో మొలటోవ్‌కు రాశారు. ఒక చిన్న ఆంతరంగిక పోరాటంవస్తే, అది ఆ బృందాన్ని పూర్తిగా కుంగదీయకపోయినా, కనీసం ఎంత వరకు బలహీనపరుస్తుందంటే, నిర్ణయాలు చేయడం ఇకదానిపై ఆధారపడి వుండదు, అని ఆయన నొక్కిచెప్పారు. 1922 లో పార్టీలో జరిగిన అభిప్రాయ సేకరణ ఫలితాలు ఆనాటికి ఇంకా లెనిన్‌కి తెలియదు. విప్లవానికిముందూ, 1917 లో పార్టీలో చేరిన వారు, మొత్తం పార్టీ సభ్యుల్లో 11 శాతమే. ఆనాడు పార్టీ సభ్యత్వం 4,00,000. పార్టీ పాతకాపుల్లో చీలిక వస్తే భావిపరిణామాలు అనూహ్యమని లెనిన్ అనుమానించారు. జరిగింది సరిగ్గా ఇదే.

లెనిన్ మరణానంతరం, పార్టీ అంతరంగిక పోరాటం మరింత ఉధృతంగా చెలరేగింది. ఈ పోరాటంలో అధికారంకోసం పోరాటం భాగమయింది. అధికారం కోసం పాకులాటల్లోని అంశాలు వాదోపవాదాలకు, ఆయాపక్షాలు అవలంబించిన రాజీలేని వైఖరులకు, అగ్నికి ఆజ్యంలాగా తోడ్పడ్డాయి. స్టాలిన్ తానున్న స్థానాన్నిబట్టి ఈ ధోరణులను వ్యతిరేకించవలసింది పోయి, ఆ ప్రమాదకర పరిస్థితిని విషమింపచేశారు. అది ఆయన స్వభావానికి అనుగుణమైనదే. లెనిన్ దీన్ని గురించే హెచ్చరించారు కూడ.

ఆ పరిస్థితిలో ముఠాతత్వం మూడు పువ్వులు, ఆరుకాయలుగా వృద్ధిచెందుతూండేది. ఆ పోరాట సహజగతిని బట్టే అది అనివార్యంగా ముఠాల పోరాటరూపం ధరించింది.

ప్ర: స్టాలిన్ సహచరులను ఆయన చుట్టూ వుంటూ ఆయనతో అధికారాన్ని పాలువంచుకున్న వారిని — విశ్లేషించి చూడటం చాలా ముఖ్యమను కొంటున్నాను. వ్యక్తి పూజా కాలంలో అనేకుల విషాదకర మరణానికి కారకుడైన నేరస్తుడు స్టాలిన్ ఒక్కడే అని చాలా మంది భావించారు. ఆనాడు బాధ్యతాయుత స్థానాల్లో వున్న ప్రతి ఒక్కరూ స్టాలిన్‌తోసరికైన వారే అని ఇతరుల అభిప్రాయం.

జ: స్టాలిన్ ప్రధాన కార్యదర్శిగా పదవిని చేపట్టింది, లెనినిస్టు పొలిట్ బ్యూరోలోనే. ఆనాడు అందులో ఒకే సూత్రబద్ధ కార్యక్రమానికై దీక్ష వహించిన కమ్యూనిస్టులుండేవారు. కాని ఆ కార్య క్రమాన్ని అమలు పరచే విషయంలో వారికి భిన్నాభిప్రాయాలుండేవి.

లెనిన్ హయాములో, పొలిట్ బ్యూరో, ప్రజా కమిస్సార్ల సమితి, ఈరెండూ అత్యంత ప్రతిభావంతులతో యేర్పడిన సంస్థలు. విదేశీపరిశీలకులు కూడ ఇది గమనించారు. లెనిన్‌ను, ఇతర నాయకులను కలుసుకొని మాట్లాడిన కర్నల్ రాబిన్స్ (సోవియట్ రష్యాలోని రెడ్

క్రాస్ తాలూకు అమెరికా ప్రతినిధి) తన అను భవాలనుగురించి రాసిన పుస్తకంలో, మొట్టమొదటి సోవియట్ ప్రభుత్వం, ప్రపంచ ప్రముఖ దేశాల ప్రభుత్వాలలోకెల్ల అత్యంత సమర్థవంతమైనదని రాశారు.

కానివారు వాదించుకొనే వారు. అందరూ ప్రతిభావంతులైనప్పుడు ఇది సహజమే. కాని, ఒకరితో ఒకరు వాదించుకొంటూ, స్టాలిన్, ట్రాట్స్కీల్లాగా ఒకరినొకరు ద్వేషించుకొంటూన్న వారందరిలోని సత్తాలను సమన్వయపరచే లాగా పనిని లెనిన్ వ్యవస్థీకరించ గలిగారు. వారి శక్తి యుక్తులను ఉమ్మడి ఆశయ సాధన మార్గంలో నడిపించగలిగారు.

స్టాలిన్ పొలిట్ బ్యూరో యిందుకు భిన్నమైనది. అందులో వేరువేరు సంవత్సరాల్లో భిన్నభిన్న వ్యక్తులున్నారు. కాని వారంతా స్టాలిన్ విధానాన్ని బలపరచారు. అది వారి విధానం, కాబట్టి వారంతా దానికి బాధ్యత వహించాల్సిందే.

అయితే అది లెనినిస్టు విధానంనుంచి పెడ మార్గం పట్టినందుకు, దమనకాండను అమలు జరిపే యంత్రాంగం నిర్మాణమయినందుకు బాధ్యత స్టాలిన్‌దే.

ప్ర: సామూహిక ధమన చర్యలను గురించి స్టాలిన్‌కు తెలిదని కొందరంటున్నారు.

జ: స్టాలిన్‌కుఅంతా తెలును. అయితే, ఆయన తన నిర్ణయాలపై ఎన్నడూ తానొక్కడే సంతకం చేయలేదు. ఇతరులు కూడ లాంచనప్రాయంగా వాటిని ఆమోదించాలని డిమాండ్ చేశాడు.

మోలటోవ్, 'కగానొవిచ్ వంటి స్టాలిన్ సహచరులు, ఈ బాధ్యతలో పూర్తిగా పాలు పంచుకోవాలి. ఇతరులు, జరుగుతున్న దాన్నంతా సహించారని అంటాను. అయితే అది సమర్థనీయమైన పనికాదు. కాని కొందరు పొలిట్ బ్యూరో సభ్యుల పనితీరు భిన్నమైనది. నాయకుల విధులూ పాత్రను గురించి వారికి తెలును. ఉదాహరణకు, కిరోవ్, ఆర్డ్జొనికిడ్జేలు స్టాలిన్ విధానాన్ని ఎన్నడూ వ్యతిరేకించక పోయినా, వారి పనితీరు వేరు. స్టాలిన్‌కు ప్రయా

**రెడ్ స్క్వేర్‌లో 1937 నవంబరు 7న జరిగిన వూరేగింపు**



# స్టాలిన్, ఆయన వ్యక్తిపూజ మూలాలు

ణాలంటే యిష్టం లేదు: ఆయన మాస్కోను వదలి వెళ్ళటం బహు అరుదు. కాలంగడిచిన కొద్దీ, ఆయన తన చుట్టూ వున్న బృందాన్ని కూడ తగ్గించుకొన్నారు.

కాబట్టి ఆయనకు, అంతకంతకు ఎక్కువగా వడపోసిన సమాచారమే అందేది.

వివిధ సంవత్సరాల్లో స్టాలిన్‌తో కలసి పని చేసిన వారిలో ప్రత్యేకించి కరొవ్, ఆర్ డ్జోనికిడ్జే, కుబిషెవ్, కాలినిస్, కృశ్చేవ్‌లను ప్రత్యేకించి పేర్కొనదలచాను. వారంతా ప్రముఖనాయకులూ, తమ సొంత స్వభావాలు సొంతపని తీరు గలవారు. అనేక విషయాల్లో భేదాలున్నా సమానమైన ఒక ప్రధాన గుణం వున్నవారు అది, జనాన్ని కలుసుకొని, వారి భావాలను, ఆకాంక్షలను తెలుసుకోవడానికి ప్రయత్నించడం. స్టాలిన్ పద్ధతులను వారు కనీసం మౌనంగా వ్యతిరేకించారను కొంటున్నాను. కానిస్టాలిన్ గొప్ప ఉపాయశాలి. ఉద్దేశ పూర్వకంగానే, తన నిర్ణయాలకు పొలిట్ బ్యూరో సభ్యుల ఆమోద ముద్ర వేయించేవారు.

ప్ర: అది ఒక విధమైన సమిష్టి బాధ్యతా?

జ: ఇది ఒకరి కొకరు పూచీపడే ఎత్తుగడ అని అంటాను. సంయుక్త నిర్ణయం చేయడమనే బంధం వీరందరినీ కలిపికట్టింది. ఇది వారి దురదృష్టం. కొందరు ఆ విధానం బాటలోనే నడిచారు. ఆర్డ్జొనికిడ్జే లాంటి యితరులు దానితో సరికుకాలేక స్టాలిన్‌తో ఘర్షణ పడ్డారు. అది అనివార్యంగా విషాద ఫలితానికి దారి తీసింది.

ప్ర: స్టాలిన్ మరణంతో ఒక బాధాకరమైన వ్యక్తి పూజా దశ అంతమైందని ఆయన సమకాలీనుల్లో చాల్లామంది అనుకోగా, మిగతా అనేకులు "జాతులపిత" లేని తమ జీవితం ఎలావుంటుందో ఊహించుకోలేక పోయారు. చరిత్రను అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్న మీరు, దీనంతటినుంచి ఏమి గుణపాఠాలు నేర్చుకోవాలని చెబుతారు? ఆ సంవత్సరాలు విషాదకరమైనవేకాదు, నాజీ జర్మనీపై విజయం, సోషలిజం నిర్మాణం వంటివి సాధించిన కాలం. గదామరి.

జ: అటువంటి గుణపాఠాలు ఎన్నో వున్నాయి. మనం చర్చించిన కాలంలో ఎన్నోవైరుధ్యాలున్నాయి. ఆ రోజుల్లో జీవించి వున్న వారికి కొన్ని విశిష్ట లక్షణాలుండేవి. అవి, ఆశయం పట్ల విశ్వాసం, ఆత్మత్యాగానికి, భవిష్యత్తు కోసం త్యాగబుద్ధితో పనిచేయడానికి సంసిద్ధత, అకుంఠిత దీక్ష. సుఖపరిత్యాగాన్ని వారు అవశ్యంగా ఆమోదించారు. ఈనాడు ఈ గుణాలున్నవారు బహు తక్కువ. తీవ్రమైన శిక్షకు భయపడి, వ్యక్తి పూజా కాలంలో ఎవరూ లంచాలకు పాల్పడలేదని కొందరంటున్నారు. అది నిజంకాదు. అయితే స్తబ్దతా కాలంలో వున్నంత లంచగొండితనం ఆనాడు లేదు. నేడు ఆనాటి భయం లేదనేది అసలు విషయంకాదు. ఈ రోజుకూడ మనదేశంలో ధనాపహరణకు, లంచాలకు పాల్పడిన వారిని తీవ్రంగా శిక్షిస్తున్నారు. అంతకన్న ముఖ్యమైన విషయమేమిటంటే, ఆనాడు ఎన్ని వక్రీకరణలున్నా, నాటి ప్రజలకు భిన్ననైతిక ప్రమాణాలుండేవి. భిన్న నైతిక వాతావరణం ఉండేది.

అయితే ఆ రోజులకు మరో పార్శ్వం కూడ వుంది. యిది వైరుధ్యం కాదు. జీవిత గతితర్కం. ఆ కాలంలో కపటం, భయం, అకారణంగా సమయానుకూలంగా ప్రవర్తించడం మొదలయిన దుర్గుణాలు వ్యాపించాయి.

ఆ వాతావరణం చైతన్యాన్ని వక్రం చేసింది; బలహీనుల గుండె నిబ్బరాన్ని హరించింది.

కాని, అంతటి కఠోరమైన నైతిక, తదితర పరీక్షలకు తట్టుకొని అనేకమంది కమ్యూనిస్టులూ పార్టీ సభ్యులు కానివారూ అక్టోబరు విప్లవ ప్రభావం కింద పరిణతులయారు కాబట్టి, తమ ఆత్మాభిమానాన్ని న్యాయం, విప్లవ ఆశయాలు తుదకు దిగ్విజం సాధిస్తాయన్న విశ్వాసాన్ని నిలబెట్టుకో గలిగారు.

## ఆధునిక కాలంలో నూతన ఆలోచనా ధోరణి

# కమ్యూనిస్టు ఉద్యమ జీవశక్తి

వదీం జగ్లాదిన్

కమ్యూనిస్టు ఉద్యమం తదభివృద్ధి లోని ఒక నూతన దశలో ప్రవేశించిందని, 1986 లో జరిగిన సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ 27 వ మహా సభ నిర్ధారణ చేసింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ప్రస్తుత స్థితిని లోతుగా విశ్లేషించి చేసిన నిర్ధారణ ఇది



ఈవ్యాస రచయిత సి.పి.ఎస్.యు. కేంద్రకమిటీ అంతర్జాతీయ శాఖ ప్రథమ ఉపాధి పతి, సి.పి.ఎస్.యు. కేంద్రకమిటీ సభ్యుడు, తత్వ శాస్త్రంలో డాక్టర్.

అణుయుగ ప్రత్యేకతల మూలంగా ఉద్భవించింది. ఇది నూతన సైద్ధాంతిక, ఆచరణాత్మక కర్తవ్యాలను నిర్దేశిస్తోంది. కమ్యూనిస్టులు తమ పోరాటంలో ప్రాధాన్యం వహించే అంశాలను, వాటి సమ్మేళనను పరస్పర సంబంధాన్ని పునఃపరిశీలించేలా చేస్తున్నది ఈ నూతన గతితర్కమే.

నేడు కమ్యూనిస్టులు కొత్త అంతర్జాతీయ పరిస్థితుల్లో పనిచేస్తున్నారు. ఆ పరిస్థితులివి; పెరుగుతున్న సైనిక ప్రమాదం; యుద్ధ వ్యతిరేక పోరాట ప్రాధాన్యం; యుద్ధవ్యతిరేక కార్యాచరణను వర్గప్రయోజనాలకు దోహదం చేసే కృషితో అనుసంధించవలసిన ఆవశ్యకత. సార్వజనిక ప్రయోజనాలకు, వర్గ ప్రయోజనాలకు సంబంధించిన గతి తర్కం మన

సోషలిస్టు, సోషలిస్టేతర దేశాల్లోని కమ్యూనిస్టు పార్టీలు కూడ నూతన ఆంతరంగిక పరిస్థితుల్లో పనిచేయవలసివుంది. సోషలిస్టు దేశాల్లో, వాటి అభివృద్ధి త్వరీకరణకు, వాటి ఆర్థిక వ్యవస్థల సాంద్రీకరణకు, సామాజిక సమస్యాయ పరిష్కారానికి, జీవిత గుణాన్ని మెరుగు పరచేందుకు, వివిధ రూపాల్లో ప్రజా

స్వామ్య అభివృద్ధికి మార్గాల అన్వేషణ వాటి అంతరంగిక పరిస్థితులను నిర్ణయిస్తోంది.

సోషలిస్టేతర దేశాల్లో, కమ్యూనిస్టు పార్టీలు ఆర్థిక రంగంలోని వ్యవస్థాత్మక మార్పులను, శాస్త్ర, సాంకేతిక విప్లవ నూతన దశతో పెనవేసు కొని సామాజిక నిర్మాణ స్వరూపంలో వస్తున్న మార్పులను పరిగణనకు తీసుకోవలసివుంది. పారిశ్రామిక పెట్టుబడి దారీ దేశాల్లో కమ్యూనిస్టు పార్టీలు దీర్ఘ సంక్షోభాల అధికాధిక తీవ్రతను యెదుర్కోవలసివుంద. వర్ధమాన దేశాలు కూడ ఇటువంటి మార్పుల ప్రభావానికే లోనయ్యాయి. శాస్త్ర సాంకేతిక విప్లవం వాటి ఆర్థిక, సామాజిక నిర్మాణ స్వరూపాలనుసమూలంగామార్చివేస్తు న్నాయి.

అభివృద్ధి నిరోధక బూర్జువా బృందాలు కమ్యూనిస్టులపై అంతకంతకు ఎక్కువగా తెస్తున్న ఒత్తిడిని కూడా గమనించడం అవసరం. మితవాదపు ఉప్పెన అని పేర్కొనబడు తున్న పరిణామం పలుపెట్టుబడిదారీ దేశాల్లో అంతరంగిక విధానాలను మితవాదం వైపు నెట్టింది. అలాంటి దేశాల్లో కమ్యూనిస్టుల పరిస్థితులను, వారి కార్యకలాపాలను ఈ పరిణామం అవశ్యంగా ప్రభావితం చేసింది.

సోషలిస్టు దేశాల్లో వస్తూన్న పరిణామ క్రమాల ప్రభావం సోషలిస్టేతర ప్రపంచంలో కమ్యూనిస్టు ఉద్యమ అభివృద్ధిక్రమంపై పడకతప్పదు. 1960-1980 మధ్య కాలంలో ఆ ప్రభావం ప్రతికూలమైనది. చైనాలో "సాంస్కృతిక విప్లవం", చెకోస్లావాకియా, పోలెండ్‌లలో ప్రతికూల పరిణామాలు, సోవియట్ యూని యన్, కొన్ని యితర సోషలిస్టు దేశాల్లో 1970 లలోనూ, 1980 దశాబ్ది తొలి సంవత్సరాల్లోనూ సామాజిక, ఆర్థికాభివృద్ధి మందగించడం, బూర్జువా ప్రచారానికి తోడ్పడ్డాయి. తద్వారా, విశాల ప్రజానీకంపై సోషలిజం ఆశయాల ప్రభావాన్ని బలహీన పరచడానికీ, కమ్యూని స్టుల కార్య కలాపాలను కుంటుపరచడానికీ ఉపయోగపడ్డాయి. ఈ దశాబ్దాలలోని ప్రతి కూల పరిణామాలకు గల వస్తుగత, ఆత్మా శ్రయకారణాలను, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, ఇతర సోదర పార్టీలు కూలంకషంగా విశ్లే షించాయి.

విప్లవ క్రమం మీద సోషలిజం తన అతి బలోపేత ప్రభావాన్ని తన ఆర్థిక విధానం ద్వారానే నెరవుతుందని లెనిన్ చెప్పారు. సోషలిజం మొత్తం చరిత్ర ఈ నిర్ధారణ సరియైనదని ధ్రువ పరచింది. కాని విప్లవ క్రమాన్ని సోషలిజం విజయాలూ, దాని వైఫల్యాలూ, కష్టాలూ కూడ ప్రభావితం చేస్తా యని జ్ఞాపకం వుంచుకోవాలి. కాబట్టే, ఈ పురోగామి సామాజిక వ్యవస్థలోని అవకాశాల ను మరింత పరిపూర్ణంగా ఆవిష్కరించడం, పెట్టుబడి దారీ విధానానికి నిజమైన ఏకైక ప్రత్యామ్నాయమైన సోషలిజాన్ని సర్వతో ముఖంగా పటిష్ఠం చేయడం సోషలిస్టుదేశాల సోదర కమ్యూనిస్టుపార్టీల, ముఖ్యంగా సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చారిత్రక బాధ్యత.

సామాజికాభివృద్ధి ప్రస్తుత దశలో ఉత్పన్న మైన కొత్త సమస్యలను అన్ని దేశాల కమ్యూ నిస్టులు లోతుగా, శాస్త్రీయ దృష్టితో విశ్లేషించడం అవసరం. వారు వ్యవహారాలను సృజనా త్మకంగానరిదిద్దుకో గలగాలి. మరో విధంగా చెప్పాలంటే కమ్యూనిస్టు ఉద్యమాన్ని నూతన ఆలోచనా పద్ధతులను బట్టి పునస్సమీక్షించాలి. ఇది స్పష్టమే. అయితే, కొత్త మనస్తత్వానికి మారుతున్నామనే సాకుతో కమ్యూనిస్టు ఉద్యమ మౌలిక సూత్రాలను మార్చే ప్రయత్నా లకు పూర్తిగా ఎట్టి ఆధారమూ లేదనేదికూడ అంతగానూ స్పష్టమే. పైపెచ్చు, నూతన పరిణామాలను పరిగణనకు తీసుకోవడం, కొత్త పరిస్థితులకు అనువైన కొత్తరాజకీయ, వ్యూహా త్మక నిర్ధారణలనూ, ఎత్తుగడలకు సంబంధించిన నిర్ధారణలనూ చేయడం మార్క్సిజం-లెనినిజం మౌలిక సూత్రాల, దాని పరిశోధనా పద్ధతుల ప్రాతిపదికపై మాత్రమే సాధ్యం.

పెరిస్త్రోయికా విధానాన్ని రూపొందించడంలో సి.పి.ఎస్.యు. ఈ సూత్రాలనూ, పరిశీలనా

పద్ధతినీ అవలంభించింది. స్థితిగతులను పిడివాద దృష్టితో కాక, సృజనాత్మకంగా చేసిన పరిశీలన, ప్రపంచంలో, జాతీయ పరిణామాలలో మార్పులను గురించిన పరిశీలన మార్క్సిస్టు -లెనినిస్టు బోధల జీవ శక్తిని మరోసారి ధ్రువ పరిచింది.

నేటి దశలో, కమ్యూనిస్టు ఉద్యమ ప్రస్తుత ప్రత్యేక తలనన్నిటినీ పరిగణనకు తీసుకోవడం చాలా ముఖ్యం. అటువంటి ప్రత్యేకతలలో ఆ ఉద్యమ అనేకత్వం ఒకటి. ఇది సహజమే. ఎందువల్లనంటే, దాదాపు ప్రపంచంలో నలు మూలలా కమ్యూనిస్టు, వర్కర్ల పార్టీలున్నాయి. వాటి వ్యూహాలు, ఎత్తు గడలు భిన్నమైనవి. ప్రతి కమ్యూనిస్టు పార్టీ తన జాతీయ పరిస్థితినీ, తన దేశ అంతర్జాతీయ స్థాన ప్రత్యేకతలను పరిగణనకు తీసుకో ప్రయత్నిస్తూంది. అనేక త్వం ప్రతికూల పరిణామం కాదు. సరికదా, కార్యకలాప రూపాల బహుళత జాతీయ ప్రత్యే తలను, తమ దేశంలోని నిర్దిష్ట చారిత్రక స్థితిని మరింత చక్కగా అవగాహన చేసుకొ నేందుకు, తదుచితమైన విధానాన్ని రూపొందించు కొనేందుకు తోడ్పడుతుంది.

అంతేకాదు, పరిస్థితుల వైవిధ్యం, అభిప్రాయ భేదాలను, అనేకత్వాన్ని ఉత్పన్నం చేస్తుంది. కమ్యూనిస్టు ఉద్యమం వంటి విశాల ఉద్యమంలో అన్ని సమస్యలపై దృక్పథాల్లో సంపూర్ణ సారూప్యం అసంభవం.

నిర్దిష్ట సమస్యలపై ఎటువంటి అభిప్రాయ భేదాలున్నప్పటికీ, సోదర భావంతో చర్చించ డం, పరస్పర ఆమోద యోగ్యమైన అంచనా లను సమిష్టిగా రూపొందించడం ఉపయోగ కరం. ఎందువల్లనంటే జీవితానుభవమే, పోరాటాలే అనేక సమస్యలను తొలగిస్తాయి. మార్క్సిజం లెనినిజంలోని విప్లవ సారాంశంపై దాడి జరిగి నట్లయితే కమ్యూని స్టులు సూత్ర బద్ధ వైఖరులను దృఢంగా సమర్థించాలని వేరే చెప్ప నవసరం లేదు. ఈ సూత్రం నుండి వైదొలగడంవల్ల కమ్యూ నిస్టు ఉద్యమం దెబ్బతింటుందని అనుభవం నిర్ద్వంద్వంగా నిరూపించింది.

గత ఎనిమిది, పది సంవత్సరాల్లో పార్టీల మధ్య విభేదాలూ, అనంగీకారాలు వాటి అంతర్జాతీయ పరస్పర చర్యలను బలహీన పరచాయి. యూరపు కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీలకు ఇది మరింత వర్తిస్తుంది. 1971-1985 మధ్య 140 ప్రాంతీయ సమా వేశాలు, 136 సైద్ధాంతిక చర్చలు జరిగినప్ప టికీ, యూరోపియన్ పార్టీలు వాటన్నిటికీ ఆసక్తిగల సమస్యలపై విస్తృతమైన అంతర్జా తీయ చర్చను యేర్పాటు చేయలేక పోయాయి.

కమ్యూనిస్టు ఉద్యమం నిజంగా కొన్ని కష్టా ల్లో వుంది. అయితే, వీటిని గోరంతలు కొండంతలు చేయరాదు. చరిత్రపొడుగునా, కార్మికోద్యమ చరిత్రలో కూడ చైతన్యం అస్తిత్వా నికన్న వెనుకబడేవుంది. ఇది ఎల్లప్పుడూ తీవ్ర మైన చిక్కులను తెచ్చిపెట్టింది. కాని సరియైన, సూత్రబద్ధమైన, సమ్యమైన, నూతన పథాన్వే షణా శీలమైన విధానాన్ని చేపట్టినప్పుడు ఈ చిక్కులను అధిగమించింది. కమ్యూనిస్టు ఉద్యమం ప్రస్తుత మున్న చిక్కులను నమ్మకంగా అధిగమిస్తుంది. కాని యిందుకు గట్టికృషి అవసరం.

గతంలో లాగానే కమ్యూనిస్టు సూత్రాలను అమలు పరచడంలో దృఢ దీక్షకు, నిలకడకు నిర్ణాయక పాత్రవుంది. జీవితానుభవం యీకింది క్రమాను సరణిని ధ్రువపరుస్తోంది: **పరిస్థితిక్లిష్టమైన కొద్దీ, ఆ పరిస్థితిని మార్చ డానికి, రూపొందించుకొన్న విధానానికి మరింత కట్టుబడి వుండటం, మరింత సృజ నాత్మక దృక్పథం అవసరమవుతుంది.** చరిత్ర ఎంత తీవ్రమైన మలుపులు తిరిగితే, కమ్యూ నిస్టులకు ఈ గుణాలుండటం అంత ముఖ్యం.

కమ్యూనిస్టు ఉద్యమంలోని ప్రస్తుత ప్రత్యేక పరిస్థితిలో సి.పి.యస్.యు. ఎలా పనిచేయ నుంది? ఈ ప్రశ్నకు 27 వ మహాసభ స్పష్ట మైన సమాధాన మిచ్చింది. ఇతర సోదర పార్టీలతో తన సంబంధాలను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ఏసూత్రాలననుసరించి నిర్మించుకోవడం కొనసాగించాలో ఆ మహాసభ

నిర్దేశించినది.

మొదటిది, కమ్యూనిస్టు ఉద్యమ పాత్రను, ప్రాముఖ్యాన్ని ప్రాతిపదికగా చేసుకొని కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీలన్నిటితోనూ తన సంబంధాలను సి.పి.ఎస్.యు పెంపొందించుకుంటుంది. ఇది అంతర్జాతీయ రంగంలో దాని కార్యకలాపాల ప్రధాన మార్గం.

రెండవది. కమ్యూనిస్టు పార్టీల మధ్య గల విభేదాలను సి.పి.యస్.యు. గోరంతలు కొండంతలుగా చూపదు. అన్ని కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీల తోనూ, వాటితో విభేదాలు వున్నా లేకపోయినా, సోదర సంబంధాలు కొనసాగించాలి.

మూడవది: ప్రస్తుత పరిస్థితిలో కమ్యూనిస్టు పార్టీల మధ్య సహకారానికై పాటు పడుతూనే, అటువంటి సహకారానికీ, కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతకు, గతానుగతిక భావాల ఉద్ఘాటనతో, ఒకదాని విధానాన్ని మరొకటి గుడ్డిగా అనుకరించడంతో, ఇతర పార్టీల అంతరంగిక వ్యవహారాల్లో జోక్యంతో, సత్యం తన గుత్త సొమ్మని చెప్పుకోవడంతో ఎటువంటి పొత్తు లేదని సి.పి.ఎస్.యు. ఎల్లప్పుడూ చెబుతూ వచ్చింది. ఒకరు ఇతరులపై తన భావాలను రుద్దే ప్రయత్నాలను సోవియట్ కమ్యూనిస్టు పార్టీ తిరస్కరిస్తోంది.

నాల్గవది, అంతర్జాతీయ విధానంలో ఉత్పన్నమైన సమస్యలను, కమ్యూనిస్టు ఉద్యమ విధాన సమస్యలను మరింత లోతుగా సృజనశీలంగా అధ్యయనం చేయటం తన ధర్మమని సి.పి.ఎస్.యు. భావిస్తోంది. మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌ల అమరబోధలపై ఆధారపడిన ఈ పరిశీలనలు ఈ విధాన యత్నోధిక విపులీకరణకు తోడ్పడుతాయి.

ఉమ్మడి లక్ష్యాలయిన శాంతి సోషలిజముల పెంపుదలలో సోదర పార్టీల వర్గ సంఘీభావం, సమాన స్థాయీ సహకారం వల్ల కమ్యూనిస్టు ఉద్యమం బలంగా ఉండగలదు, ఉంటుంది, అని, సి.పి.ఎస్.యు 27 వ మహాసభ ఆనందిగ్ధంగా నొక్కి చెప్పింది.

నిరాయుధీకరణపై. 1988లో జరిగిన ఐరాస సర్వప్రతినిధి సభ ప్రత్యేక సమావేశం. మన అణుయుగంలో భద్రతపట్ల ప్రపంచ దేశాల దృక్పథాలను, ఆయుధాల తగ్గింపు, నిరాయుధీకరణ సమస్యల పట్ల వాటి వైఖరులను వ్యక్తం చేసిన ప్రధాన వేదిక. 30 కి పైగా, వివిధ దేశాల రాజ్య, ప్రభుత్వ అధిపతులూ, ప్రపంచం నలు మూలలనుంచి వచ్చిన ప్రముఖ నిరాయుధీకరణ ప్రవీణులూ ఈ సమావేశంలో పాల్గొన్నారు. ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితినీ, నిరాయుధీకరణ పురోగతిపై దాని ప్రభావాన్నీ ఈ రంగంలో భద్రతకు హామీ కల్పించడంలో విజయాలను, వైఫల్యాలను అంచనా వేయటానికీ, నిరాయుధీకరణకు సంబంధించిన వివిధ అంశాల్లో ఎలా ముందుకు పోవాలో తమ అభిప్రాయాలను తెల్పడానికీ ఈ దేశాల ప్రతినిధులకు సమావేశం అవకాశమిచ్చింది.

ఇప్పటి పరిస్థితి, 1982లో ఇలాంటి సమావేశమే జరిగినప్పటి పరిస్థితికి పూర్తిగా భిన్నమైనది. ప్రాక్-పశ్చిమ సంబంధాలు నేడు గణనీయంగా మెరుగయ్యాయి. నిరాయుధీకరణపై ద్విపక్ష సంభాషణలు, సైనిక కూటాల మధ్య సంభాషణలు ముమ్మరమయ్యాయి. ప్రాంతీయ సంక్షోభాల పరిష్కారానికై, అఫ్గనిస్తాన్ నుంచి సోవియట్ సైనిక దళాల ఉపసంహారణ ప్రారంభంలాంటి ఒక ముఖ్య చర్య తీసుకోవడం జరిగింది.

మాస్కోలో సోవియట్-అమెరికన్ శిఖరాగ్ర సమావేశం జరుగుతున్నప్పుడే ఈ ఐరాస ప్రత్యేక సమావేశం ప్రారంభమయింది. రెండు అగ్రరాజ్యాల మధ్య సంబంధాల్లో వచ్చిన మార్పులను ప్రతిబింబించిన మాస్కో సమావేశం ఐరాస లో చర్చలకు ఒరవడి అయింది. ఈ అతిక్లిష్ట సమస్యలపై ఎంత తీవ్రమైన అభిప్రాయభేదాలున్నా వాటిపై నిర్మాణాత్మక సంభాషణలు సాధ్యమని అది నిరూపించింది మాస్కో సమావేశ ఫలితంగా అమల్లోకి వచ్చిన ఐ.ఎన్.ఎఫ్. సంధి రెండు అగ్రరాజ్యాల అణ్వస్త్రాల్లో బహుకొద్ది శాతానికే

# ప్రపంచదేశాల కుటుంబమూ, నిరాయుధీకరణ


## ఆంద్రీకొలొసొవ్‌స్కీ

**సోవియట్ యూనియన్ విదేశ వ్యవహారాల ఉపమంత్రికి సహాయకుడు, నిరాయుధీకరణపై ఐరాస సర్వ ప్రతినిధిసభ తృతీయ ప్రత్యేక సమావేశంలో సోవియట్ ప్రతినిధివర్గ సలహాదారు**


వర్తిస్తుంది గదా అని కొందరు ప్రతినిధులు అన్నప్పటికీ, ఈ సంధి అణ్వస్త్రాల తగ్గింపు క్రమంలో ఒక ముందంజే అన్న అవగాహన ఐరాస సమావేశంలో సర్వత్రా వ్యక్తమయింది.

మాస్కో శిఖరాగ్ర సమావేశం తరువాత, ఈ ఐరాస సమావేశంలో సోవియట్, అమెరికన్ ప్రతినిధుల ప్రసంగాలు ఎలా వుంటాయో వినాలని ప్రతినిధులు ఉత్కంఠతో ఎదురు చూచారు. వారు మునుపటిలాగే ఒకరిపై ఒకరు అభియోగాలు మోపుకొంటూ ఐరాసను తలపాటు వేదికగా చేస్తారేమో అని వారి అనుమానం. కాని సోవియట్ విదేశాంగ మంత్రి ఎద్వార్డ్ షెవర్డ్ నాడ్జే ప్రసంగం విన్న తరువాత వారు సంతృప్తితో ఊపిరి పీల్చుకొన్నారు. సోవియట్-అమెరికన్ నిరాయుధీకరణ సంభాషణల ప్రాముఖ్యాన్ని ఆయన నొక్కి చెప్పడమేకాక, బహుపక్ష సంభాషణలు ఈ విషయంలో నిర్వహించవలసిన పాత్రను వివరిస్తూ, వాటికి సంబంధించి నిర్దిష్ట ప్రతిపాదనలు చేశారు. ఆయన ప్రతిపాదించిన విషయాలు, చాలామంది ప్రతినిధుల ప్రతిపాదనలూ ఏకీభవించి నేడు నిరాయుధీకరణపై ఐరాస సమావేశ చర్చనీయాంశాలయాయి. సోవియట్ ప్రతినిధి తరువాత మాట్లాడిన అమెరికన్ విదేశాంగ మంత్రి జార్జి షుల్ట్జ్ ప్రసంగం విన్న తరువాత, ప్రతినిధుల భయాందోళనలు ఇంకా తగ్గిపోయాయి - ఆయన ప్రసంగం కూడ ప్రశాంతంగా, వ్యవహార సరళిలో సాగింది.

అయితే, సమిష్టి కృషికై, రాజకీయ స్థాయిలో వ్యక్తమయిన అభిలాషలకు నిర్దిష్ట సమస్యల పట్ల ఆచరణాత్మకరూపం ఇవ్వడం చాలా కష్టమని, సమావేశ తదుపరి గతిక్రమమూ, అది ఆమోదించవలసిన పత్రపాఠంగురించి, కమిటీల్లో, ఆయా బృందాల్లో జరిగిన చర్చలూ స్పష్టం చేశాయి. రాజీ వైఖరులకై ప్రయత్నించేందుకు సంసిద్ధతను సార్వత్రిక చర్చలో వ్యక్తం చేసిన కొన్ని దేశాలు, అధిక సంఖ్యాక దేశాల అభిప్రాయానుసారం తమ పంథాను మార్చుకొనేందుకు ఇష్టపడలేదు. ఐ.రా.స కార్యకలాపాల్లో నిజమైన పురోగతిని సాధించడానికీ, ఆ సంస్థను ఫలప్రదమైన బహుపక్ష సంభాషణలకు వేదికగా మార్చడానికీ, వివిధ రాజ్యాలు చాలా కష్టపడి పనిచేయ వలసి వుంటుందని తేలింది.

సోవియట్ యూనియన్, దాని వార్సానంధి భాగస్వామ్య దేశాలూ అనక్తి దాయక మైన ప్రతిపాదనలతో, ఇతర రాజ్యాల దృక్పథాలను పరిగణనకు తీసుకోవాలన్న అభిప్రాయంతో, వివిధ రంగాల్లో ఆయుధపోటీని అరికట్టడానికి స్పష్టమైన ఒప్పందాలు కుదుర్చుకోవాలన్న లక్ష్యంతో ఈ సమావేశానికి వచ్చాయి. సోష లిస్టు దేశాల ప్రతిపాదనలను యితర దేశాల బృందాలు వెంటనే అంగీకరించ లేదు. ఐతే తుదిపత్రంపై ఏకాభిప్రాయ సాధన ఆవశ్యకతను ప్రతి ఒక్కరూ నొక్కి చెప్పారు. కాబట్టి సోషలిస్టు దేశాలు దాదాపు అన్ని సమస్యల విషయంలోనూ మెజారిటీ అభిప్రాయానికి అనుగుణంగా వ్యవహరించాయి. ఈ కొత్త వాతావరణాన్ని వినియోగించుకొని, దానికి అనుగుణమైన నిరాయుధీకరణ కార్యక్రమ పత్రాన్ని రూపొందించాలని ఈ మెజారిటీ దేశాలు ప్రకటించాయి.

ఈ ప్రత్యేక సమావేశంలో ఈ మెజారిటీ, రూపొందినది, ఆయాకూటాల మధ్యగల అనుబంధాలప్రాతిపదికపై కాదు. ప్రయోజనాల మధ్య సమతూకాన్ని సాధించడానికి వాటన్నిటి సంసిద్ధత, ఆయుధాలను తగ్గించాలన్న వాటి మనః పూర్వక ఆకాంక్ష ప్రాతిపదిక అయాయి. ఈ మెజారిటీలో సోషలిస్టు దేశాలేకాక, అనేక వర్ధమాన దేశాలు, తటస్థదేశాలు, కొన్ని ముఖ్య సమస్యలపై అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్‌లు తప్ప అన్ని పాశ్చాత్య దేశాలూ వుండటం విశేషం. చైనా ప్రతినిధి వర్గం కూడ మొత్తం మీద సానుకూల వైఖరి అవలంభించింది. అణు, సాంప్రదాయక నిరాయుధీకరణలో చైనా ప్రజారిపబ్లిక్‌ను మరీ ముందుగానే చేర్పుతున్నట్లు అది అభిప్రాయ పడిన నిబంధనల వల్ల మాత్రమే అది కొన్ని అభ్యంతరాలను వ్యక్తం చేసింది.

భారతదేశం, అణ్వాస్త్రరహిత, హింసారహిత ప్రపంచస్థాపనకై ఒక చక్కని కార్యక్రమాన్ని ప్రతిపాదించింది. ప్రధాని రాజీవ్ గాంధీ ఈ సమావేశంలో దీన్ని ప్రతిపాదించారు. భారత ప్రతినిధి వర్గం పంచిపెట్టిన పత్రంలో దీని వివరాలున్నాయి. 2010 వ సంవత్సరం నాటికి సమస్త అణ్వాస్త్రాల నిర్మూలన పూర్తి కావాలని నిర్దేశించే ఈ కార్యక్రమంలో మూడు దశలున్నాయి. మొదటిదశలో సోవియట్ యూనియన్, అమెరికాలు తమ మధ్య శ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీలను నిర్మూలించాలి; వ్యూహాత్మక ఆయుధ గిడ్డంగులను 50 శాతం తగ్గించుకొనేందుకు, రణరంగ ఆయుధాలను అంచెలవారీగా నిర్మూలించేందుకూ ఒప్పందం కుదుర్చుకోవాలి. రెండవ దశలో ఇతర అణ్వాస్త్ర రాజ్యాలు తమ అణ్వాయుధాల నిర్మూలన క్రమంలో చేరాలి. మూడవ దశలో నమ్మకమైన అణ్వాస్త్రరహిత సమగ్ర ప్రపంచ భద్రతా వ్యవస్థ స్థాపితం కావాలి భారతదేశ ప్రతిపాదన 2000 వ సంవత్సరం నాటికి అణ్వాస్త్రాల సంపూర్ణ నిర్మూలన గురించిన సోవియట్ ప్రతిపాదనకే గాక, అనేక ఇతర దేశాల భావాలకు, ప్రతిపాదనలకు చాలా దగ్గరగా వుందని సమా వేశంలో వెల్లడి అయింది. అణ్వాస్త్రరహిత ప్రపంచ స్థాపనకై మార్గాన్వేషణకు అది గణనీ యమైన కొత్త దోహదమన్న అభిప్రాయం సర్వత్రా వ్యక్తమయింది.

అణ్వాస్త్ర పరీక్షల నిషేధం అణ్వాస్త్ర విసర్జన రంగంలోని ఒక ముఖ్య చర్య అని అందరూ అంగీకరించారు.

సమావేశంలో చర్చకు వచ్చిన సమస్యల్లో సాంప్రదాయక ఆయుధాల తగ్గింపు ఒకటి నిరాయుధీకరణ, సైనిక రంగంలో తమ విధానాలను రూపొందించుకోవడానికి, తమకు ఆమోద యోగ్యమైన ఆయుధాల తగ్గింపు ఫలితంగా నెలకొనే సమతౌల్యత, సుస్థిరత నిర్ణాయకాంశమని నాటో సభ్యదేశాలు గట్టిగా చెప్పాయి.

నిరాయుధీకరణపై అజమాయిషీ, సైనిక రంగంలో మరింత బాహాటత సమావేశంలో చర్చకు వచ్చాయి. ఐ.రా.స చట్రంలో అంతర్జాతీయ అజమాయిషీ యంత్రాంగ స్థాపనకై విస్తృత చర్చ జరిగింది. సోవియట్ యూనియన్ ప్రతిపాదించినట్లుగానే అర్థంసైనా,

గ్రీస్, భారత దేశం, మెక్సికో, టాంజానియా, స్వీడన్‌ల ప్రతినిధివర్గాలు నిరాయుధీకరణ అజమాయిషీలో ఐ.రా.స కు క్రియాశీల పాత్ర వుండాలన్నాయి. ఒక సంఘటిత బహుపక్ష అజమాయిషీ వ్యవస్థ వుండాలనీ, ఈ వ్యవస్థ పని చేసే పద్ధతులను పరిశీలించే బాధ్యతను ప్రవీణులతో కలిసి ఐ.రా.స ప్రధాన కార్యదర్శికి అప్పజెప్పాలని అవి సూచించాయి.

రసాయనిక ఆయుధాల నిషేధం, దూర రోదసికి ఆయుధ పోటీవ్యాప్తి నివారణ వంటి సమస్యలపై కూడ చర్చజరిగింది. ఈ సమస్యపై చర్చ సాంప్రదాయక పద్ధతిలోనే సాగింది. అమెరికా, ఈ సమస్యను సోవియట్-అమెరికన్ ద్విపక్ష సంభాషణల పరిధి వెలుపల చర్చించ నిరాకరించింది. నౌకాబల ఆయుధాల సమస్య ముఖ్యమైనదని కూడ వెల్లడి అయింది. నౌకా దళ ఆయుధాల్లో పోటీ, ఆయుధ పోటీలోని ఇతర అంశాలంతటి ప్రమాదకరమైనదని స్వీడన్, తదితర అలీన దేశాలు హెచ్చరించాయి. నౌకా బలాలు ఆయా ప్రాంతాలలో అస్థిరీ కరణకు తోడ్పడుతాయని విమర్శించాయి. కాని, అమెరికన్, బ్రిటన్, నాటో లోని ఇతర పెద్దదేశాలు ఈ వైఖరిని వ్యతిరేకించాయి. ఐ.రా.స. పత్రం రూపొందించే తుదిదశలో అమెరికా, ఆ పత్రంలో, నౌకా ఆయుధాల సమస్య ప్రస్తావనకు సైతం అభ్యంతరం చెప్పాయి.

నిరాయుధీకరణ, అభివృద్ధి సమస్యపై పాశ్చాత్య రాజ్యాలకు, వర్ధమాన దేశాలకు మధ్య తీవ్ర వైరుధ్యాలు మళ్ళీ వ్యక్తమయాయి. ఈ సమస్యపై మునుపటి ఐ.రా.స సమావేశంలో అమెరికా అసలే పాల్గొన లేదు. ఈ సారి అది పాల్గొంటూ నిరాయుధీకరణకూ, అభివృద్ధికీ మధ్య ప్రత్యక్ష సంబంధమే లేదని పునరుద్ఘాటించింది. నిరాయుధీకరణ, అభివృద్ధిపై జరిగిన సమావేశంలో నిర్ధారణ అయిన వైఖరినుండి ఇతర పాశ్చాత్య రాజ్యాలు కూడ వైదొలగాయి. కాని ఈ రెంటి మధ్య సంబంధం ఉందనేది వర్ధమాన దేశాల దృఢ వైఖరి.

ఇదంతా అంగీకరిస్తూనే ఒక విషయం గమనంలోకి తీసుకోవడం అవసరం నిరాయుధీకరణ ప్రథమదశ తరచు అదనపు ఖర్చులతో కూడు కొన్నది. అది జరుగుతు న్నప్పుడే విడుదల అయిన నిధులు చెల్లించా లని కోరడం, నిరాయుధీకరణకు అభివృద్ధికీ మధ్య సంబంధముందన్న దృక్పథ పర్యవ సానంగాకాక, నిరాయుధీకరణపై పన్ను విధించాలని పిలుపు ఇవ్వడం అవుతుంది.

* * *

సమావేశ తుదిపత్రం తయారు చేయ డానికై ఎంతో కృషి జరిగింది. కాని, దాన్ని రూపొందించలేక పోయారు. కాని, రాజకీయ అంచనాల సంగతికి తిరిగివచ్చినప్పుడు సమావేశ ఫలితాలు ఈ పత్రానికి పట్టిన గతికే పరిమితమైనవి కావని, అందరూ నొక్కి చెప్పారు. ఇది చెప్పుకోదగిన సమావేశం. సార్వ త్రిక చర్చ జరిగిన వాతావరణం కొత్తది. సమస్యలపై మరింత వ్యవహార సరళిలో, మరింత నిర్దిష్టంగా చర్చ జరిగింది. అమలు జరిగేందుకు బాగా వీలున్న అనేక ప్రతిపాదనలు వచ్చాయి.

సాధికారికంగా నమోదైన ఫలితాల సంగతికి వస్తే, ఒక సర్వ సమగ్ర పత్రం గురించి అంగీకారం కుదిరే అవకాశం ప్రస్తుత పరిస్థి తుల్లో, కొంత వరకు లేదనేచెప్పాలి. ఊకదం పుడు ఉపన్యాసాలదశపోయింది. నిర్దిష్ట సమస్యలను దేశాలు తరచి చూస్తున్నాయి. అసలు విషయానికి వస్తున్నాయి. కాని అన్ని సమస్యలను మొత్తంగా సమన్వయ పరచడానికి వీలుకానన్ని సొంత ప్రయోజనాలు ఆయా దేశాలకు వున్నాయి. ఆయావిడివిడి రంగాల్లో ఈ సమన్వయాకరణ జరగాలి. పరిమితమైనవే అయినా ఆచరణ సాధ్యమైన చర్యలను తలపెట్టాలి. సమావేశ పత్రానికి సంబంధించిన కృషి సందర్భంగా, అటువంటి పలు చర్యలపై అంగీకారం కుదిరింది. కాని, ఆ పత్రంకాని, దాని లోని నిబంధనలు కాని రూపుదిద్దుకోలేదు.

(మెజ్డునరోద్నయా జీజ్న్ నుంచి)

# శాస్త్రసాంకేతికరంగం

ప్రశ్న: భవిష్యత్తును గురించి చెప్పడం కష్ట మని కొందరి వాదన. వేగంగా అభివృద్ధి చెందుతున్న రోదసి పరిశోధన భవిష్యద వకాశాలను గురించి చెప్పడం మరీ కష్ట మంటారు.21 వ శతాబ్దంలో రోదసి ఆవిష్కర ణల గురించి, కుజ గ్రహ యాత్ర గురించి చెపుతారా!

జవాబు: సాంకేతికంగా చెప్పాలంటే మనం యీ రోజు కూడా కుజ గ్రహానికి వెళ్ళొచ్చు శూన్య గురుత్వాకర్షణ పరిస్థితుల్లో రెండేళ్ల పాటుమానవుడు వుండగలడా? అనేదే పెద్ద ప్రశ్న. యిలాంటి పరిస్థితుల్లో దాదావు సంవ త్సరం పాటు సోవియట్ వ్యోమగాములు గడి పారు.

ఈ శతాబ్దంలోనే రాజకీయ వేత్తలు, శాస్త్ర వేత్తలు కుజగ్రహానికి సంయుక్త యాత్ర సాగించాలని ఇటీవల పత్రికల్లో రాస్తున్నారు. అయితే శూన్య గురుత్వాకర్షణ శక్తికి తట్టుకొని నిలువ గల బలాన్ని సంపాదించి యీ యాత్రను 21 వ శతాబ్దంలో మాత్రమే నిర్వహించగలం. భావి ఆవిష్కరణలకు వునాది యీ నాటి ఆవిష్కరణలే.

కుజగ్రహయాత్ర గురించిన ఆలోచన చాలాకాలంగా శాస్త్రజ్ఞులకు వుంది. అక్కడ జీవ జాలం వున్నదా, లేదా అనే ప్రశ్నకు యీనాటికీ సమాధానం లేదు. అక్కడ జీవజా లం వుందని చెప్పడానికి ఆధారాలున్నాయి. కుజగ్రహంపై యింకిపోయి నట్టు కనిపించే నదుల చారలు, ఈజిప్టులోని పిరమిడ్‌కన్నా ఎత్తయిన పిరమిడ్లు మాటేమిటి? వైకింగ్ 1 ఫొటోలు రేకెత్తించిన యీ ప్రశ్నకు సమాధానం 21వ శతాబ్దంలో లభిస్తుంది.

ప్ర: **అణ్వాయుధాలను, రసాయనిక, జెనె టిక్ ఆయుధాలలాంటి సామూహిక విధ్వంసక ఆయుధాలను నిర్మూలించడానికి మనం కృషి చేస్తున్నాం. యీ విషయంలో 21 వ శతాబ్దంలో సాధించ నున్నదేమిటి?**

జ: మారణాయుధాల సమస్య చాలా క్లిష్ట మైనది. రానున్న శతాబ్దంలో రోదసి ఆవిష్క రణలపై ఆసక్తి కన్నా మానవాళి మనుగడను కాపాడే సమస్యపై ఆసక్తి పెరుగుతుంది. అణ్వా యుధాల నిర్మూలనపై సోవియట్ యూని యన్ చేసిన ప్రతిపాదనలు చాలా ప్రగతి శీలమైన యీ ప్రతిపాదనల ప్రకారం తగ్గించిన తర్వాత యింకా 46 శాతం ఆయు ధాలుంటాయి. అవి ప్రాణి కోటిని ఏడుసార్లు ధ్వంసం చేయగలవు. అంతేకాక అణ్వస్త్ర రాజ్యాల సంఖ్య పెరుగుతోంది. యిది పరిస్థి తిని మరింత క్షీణింపజేస్తోంది. నిరాయుధీ కరణ రంగంలో యెంతో కృషిజరుగుతోంది. యీ శతాబ్దంలో మనం భూమ్మీద ప్రాణికోటిని రక్షించడా నికి శక్తి వంచన లేకుండా కృషి చేయడం ముఖ్యం.



అలెగ్జాండర్ కజాన్త్సేవ్ ప్రసిద్ధ ఫ్యూచరాలజిస్టు, సైన్స్ ఫిక్షన్ రచయిత. ఆయన యెన్నో సాహిత్యపరమైన బహుమతుల ను గెలుచుకున్నాడు. ఆయన రచనలు కొన్ని 36 విదేశీ భాషల్లోకి అనువదించి, ప్రచు రించడం జరిగింది. 21వ శతాబ్దంలో మానవాళి ప్రగతిని గురించి ఎ.పి.ఎన్ విలేకరికి ఆయన తెలిపిన విషయాలను యిక్కడ పొందుపరుస్తున్నాం.



# మానవాళి ఎలా పురోగమిస్తుంది ?

ప్ర: భవిష్యత్తులో శక్తి పరిశ్రమ అభివద్ధి గురించి చెప్తారా? యిందులో అణువిద్యుత్ కేంద్రాలు నిర్వహించే పాత్రయేమిటి?

జ:,యీ విషయం, గతంతో విడదీయరాని విధంగా ముడివడి వుంది. గతంనుండీ మనం ముమ్మరంగా వినియోగి స్తున్న చమురు, గ్యాస్, బొగ్గు,యితర ఖనిజా లు మున్ముందు లభ్యంకావు. యీ సమస్యనీ అణు విద్యుత్ పరిష్కరించగలదు. అయితే నేడు మనం యెదుర్కొంటున్న సమస్య యిదొక్కటేనా?

అణు విద్యుత్తుపై, దాని వినియోగంపై రానున్న శతాబ్దంలో అభిప్రాయాలు యిప్పటి లాగానే వుండవు. యీ నాటికీ మనం యే విషయాన్ని అయినా డబ్బుల లెక్కలో చూస్తు న్నాం. అందుకే మన పూర్వీకులలాగేనే ఆహారాన్ని శక్తిని పాతవద్ధతుల్లో సమ కూర్చుకుంటున్నాం.

అణు విద్యుత్కేంద్రాలను మనం యిప్పుడు భూమ్యుపరితలంపై నిర్మిస్తున్నాం. యిది యీనాటి పెద్ద పొరపాట్లలో ఒకటి. అవి మనకూ,ప్రకృతికి యెలాంటి నష్టం చేయకుండా వుండటానికి వాటిని భూగర్భంలో నిర్మించాలి. నేను అణు విద్యుత్ కేంద్రాలకు వ్యతిరేకికాను, అయితే ఛెర్నోబిల్ ఉదాహరణనే తీసుకోండి. రేడియో ధార్మిక వ్యర్థ పదార్థాల నిల్వకూడా

ఒక సమస్య అయింది. పశ్చిమ యూరప్ వీటితో యిదివరకే ఉక్కిరి బిక్కిరి అవుతోంది. అమెరికా వాటిని నిర్లక్ష్యంగా సముద్రంలో గుమ్మరిస్తోంది. దీని ప్రభావం విషపూరితమైన చేపల లేదా యితర సముద్ర వుత్పత్తుల రూపంలో నేడో రేపో కనిపిస్తుంది.

తావ విద్యుత్కేంద్రాలు గాలిని కలుషితం చేస్తాయి కాబట్టి అవికూడా అంతే ప్రమాదకరమైనవి. భూమ్మీద వందల మిలియన్ల సంఖ్యలో గల ఆటోమొబైల్స్ కూడా యింతటి ప్రమాదకరమైనవే. యివి వదిలివేసే కార్బన్ డై ఆక్సైడ్ వాతావరణ ఎగువ పొరలోకి దూసుకపోయి అక్కడ ఒక పారదర్శక పొరగా యేర్పతుంది. యీ పొరభూమి పైకి సూర్య కిరణాలను వదులుతుంది, కాని భూమి విడుదల చేసే వేడి దూరలోదసిలోకి వెళ్లకుండా నిలిపివేస్తుంది. ఫలితంగా భూమి విపరీతంగా వేడెక్కుతుంది. భూమి వుష్ణోగ్రత మూడు డిగ్రీలు పెరిగినా సరే విపత్కర పర్యవసానాలు సంభవిస్తాయి -ధృవాల వద్ద గల మంచు కరిగిపోయి సముద్రనీటి మట్టం 50-70 మీటర్ల వరకు పెరుగుతుందని శాస్త్రజ్ఞుల అంచనా యిదే జరిగితే ఒక్క మాస్కో నగరం తప్ప యూరపియన్ రాజధానులన్నీ నీట మునిగిపోతాయి. అందువల్ల సూర్యునికీ, భూమికీ మధ్య జరిగే శక్తి మార్పిడులలో మనం జోక్యం చేసుకోకుండా ఆ సమతూకాన్ని కాపాడాలి.

మరో విషయం. భూమ్మీద వాతావరణాన్ని అంతటా ఒకే విధంగా సౌరశక్తి వేడెక్కించదు. భూమ్మీద వీస్తున్నగాలి శక్తిని మనం చెప్పుకోదగినంతగా వినియోగించుకోవడంలేదు. సముద్రం పైపొరలకు గాలినుండి సంక్రమిస్తున్న శక్తిని మనం యిప్పుడు వినియోగించుకోనందువల్ల అదివేడిగా మారి దూర రోదసిలోకి పోతున్నది. చమురు వుత్పత్తి కోసం యిప్పుడు తీరప్రాంత జిల్లాల్లో అనేక దేశాలు వేదికలను నిర్మిస్తున్నాయి. 21వ శతాబ్దంలో యిలాంటి వేదికలే ఫ్లోట్ స్టేషన్లు అవుతాయి. తీరం వద్ద గల రిజర్వాయర్లనీటిలోకి గాలిని ప్రవహింపజేసే ప్రత్యేక యంత్రాంగాలను యీ ఫ్లోట్స్ పనిలో పెడుతాయి. పది వాతావరణ పీడనలకు సమానమైన గాలిని రిజర్వాయర్లలోకి యీ ఫ్లోట్స్ !ప్రవహింపజేయగలవు. దీనివల్ల ఒకరిజర్వాయరు నుండి మరో రిజర్వాయరుకు మామూలు టర్బయిన్లగుండా నీరు ప్రవహిస్తుంది. వందమీటర్ల యెత్తునుండి పడే జలపాత మంతటి శక్తి యీనీటికి వుంటుంది. యీ విధంగా వాతావరణం కలుషితం కాకుండా విద్యుచ్ఛక్తిని తయారు చేసుకోవచ్చు.

ఈ విధంగా 21 వ శతాబ్దంలో శక్తి సమస్యలను పరిష్కరించుకోగలం. ఆటో మొబైల్స్ హైడ్రోజన్ యింధనాన్ని వినియోగిస్తాయి. హైడ్రోజన్ కేంద్రాలను పనిలో పెట్టడం వల్ల వాతావరణంలో కొరతగా వున్న ఆక్సిజన్ పూరింపబడుతుంది.

21 వ శతాబ్దంలో మానవాళి వాతావరణాన్ని పారిశ్రామిక స్థాయిలో ఓజోన్ మయం చేస్తుంది. అంటార్కిటికాపైగల ఓజోన్ రంధ్రం యిప్పటికే శాస్త్ర వేత్తలకు ఆందోళన కల్గిస్తోంది. పరిసరాల పట్ల యీనాడు గల వైఖరి మూడవ సహస్రాబ్ది ప్రారంభంలో మారుతుంది. పరిసరాల పరిస్థితిని మెరుగు పర్చడానికి దేశదేశాల ప్రభుత్వాలు పెద్ద మొత్తాలను కేటాయిస్తాయి. యీనాడు మనం కలుషితం చేస్తున్న నదులను, సరస్సులను అవి శుభ్రంచేస్తాయి.

**ప్ర: కేన్సర్, ఎయిడ్స్ లాంటి వ్యాధులను 21 వ శతాబ్దంలో మానవాళి నిర్మూలించగలదా?**

**జ:**ఎయిడ్స్ వేక్సిన్‌ను మానవాళి తయారు చేస్తుంది; **అయితే యీ వ్యాధిని నైతిక పద్ధతుల్లో నిర్మూలించవచ్చని** నేననుకుంటున్నాను. **కేన్సర్‌కు కూడా 21 వ శతాబ్దంలో చికిత్స సాధ్యమౌతుంది. జీన్ యింజనీరింగ్ అంటే నాకుభయం. దానివల్ల అపార** ప్రయోజనాలున్నప్పటికీ **అది** మానవాళి **అభివృద్ధికి** ప్రమాదాలను సృష్టిస్తుంది. మానవాళి **అభివృద్ధిని,**

ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని అలాంటి విజ్ఞానశాస్త్ర విభాగాల అభివృద్ధిని 21 వ శతాబ్దంలో మానవాళి మానివేస్తుందని నేనను కుంటున్నాను.



ప్ర: ఇప్పుడు కూడా మానవాళి ఆహార పదార్థాల కొరతను అనుభవిస్తోంది. 21వ శతాబ్దంలో ఆహార సమస్యను ఎలా పరిష్క రిస్తారు?

జ: 1946 లో ఫ్రాన్స్ ఒక ముఖ్య మార్గాన్ని అస్ఫాల్ట్ పొరతో నిర్మించింది. ఆ పొర రాత్రికి రాత్రే నాశనమైంది—దాన్ని కాండిడా ఫంగీతినేసింది. అస్ఫాల్ట్‌లో పుష్క లంగా గల పెట్రోలియం వ్యర్థ పదార్థాలపై, పారాఫిన్స్‌పై కాండిడా చాలా వేగంగా అభివృద్ధి చెందుతుంది. అస్ఫాల్ట్‌లోఉదయా న్నే ఒక కిలో ఈస్టు వుంచితే మరునటిరోజుకు మనకు ఒకటన్ను ముడి పదార్థం లభిస్తుంది. ఈ ఏకకణ ఫంగీలు మానవునిలో కూడా వున్నాయి. యీ విధంగా 21 వ శతాబ్దంలో కృత్రిమ ప్రొటీన్ల వుత్పత్తి వాణిజ్య స్థాయిల నందు కుంటుంది. యిప్పుడు మనం గోధుమ, యితర ధాన్యాలను పండిస్తున్న భూమిలో ఒక బిలియన్ వంతు చాలు మొత్తం ప్రపంచానికి అవసరమైన ప్రొటీన్‌ను పొంద డానికి 21 వశతాబ్దంలో మైక్రో బయలాజికల్ స్థాయిలో ప్రొటీన్ల వుత్పత్తి జరుగుతుంది. "కృత్రిమ ఆహారం" పండించిన అకడ మీషియన్ ఎ.ఎన్. నెస్మెయనోవ్ భావాలివి. భూమి యింకా వందల బిలియన్లమందికి తిండి పెట్టగలదు.

ప్ర:21వ శతాబ్దంలో నగరాలు, ఉదాహర ణకు మాస్కో ఎలా వుంటుంది?

జ: ప్రత్యేక ఫ్యాక్టరీలో ఆహారం వుత్పత్తి చేస్తే భూములను సాగు చేయాల్సిన అవసరం వుండదు. వాటి స్థానంలో అడవులు, పార్కులు, ఉద్యానాలు అవతరిస్తాయి. అయస్కాంత పరమైన రవాణావల్ల ప్రతిఒక్కరూ అనుకున్న క్షణంలో అవసరమైన చోటుకు వెళ్ళవీల ఉంటుంది. అందువల్ల వారు క్రిక్కిరిసిన జనాభా గల నగరాల్లో వుండడానికి బదులుగా సాగునుండి విముక్తి అయిన భూముల్లో నివాసాలేర్పరచుకుంటారు. ప్రధాన పారిశ్రా మిక ఫ్యాక్టరీల స్వరూపమే మరో విధంగా వుంటుంది. వర్క్‌షాపులు ఒకదాని కొకటి చాలా దూరంగా వుంటాయి. పూర్తిగా తయా రైన వుత్పత్తుల కూర్పు ఒకే చోట జరుగు తుంది.

ప్ర: 21 వ శతాబ్దంలో మానవ నీతి ఎలా వుంటుంది. అప్పటికీ మతం వుంటుందా?

జ: మతం కాలానుగుణ్యామైనది కాదు అని నేను పరిగణించినప్పటికీ నేను దాన్ని గౌర విస్తాను. మానవాళి అభివృద్ధిలోని ఒకదశలో అందుకు అవసరమైన పాత్రను మతం నిర్వ హించింది. బలమైన శక్తి అయిన మతం 21 వ శతాబ్దంలో కూడా వుంటుంది. అయితే వెయ్యి యేళ్లలో దాన్ని గుర్తుంచుకుంటారు, కాని ఆచరించడమనేది వుండదు.

ప్ర: 21వ శతాబ్దంలో సాహిత్యం యెలా వుంటుంది?విశ్వాన్ని గురించి దాదాపుమనకు తెలుసు, కాని మనను గురించి మనకు తెలిసింది చాలా తక్కువ. ధానున్న శతాబ్దంలో తనను తాను తెలుసుకునే దిశలో మానవుడు సాగుతాడు. సాహిత్యం, కళలు కూడా తదను గుణంగా మారు తాయి.

ప్రజలు నూతన ఆలోచనా సరళికి మారే శతాబ్దంగా 21 వ శతాబ్దం వుంటుంది. మతం స్థానంలో సాధారణ మానవ నైతిక ప్రమాణాలు చోటు చేసుకుంటాయి. యీ ప్రమాణాలకు యుద్ధాలు, నరవర్గ, అంతర్రాజ్య ఘర్షణలు పూర్తి పరాయమైనవి. భవిష్యత్తులోకి నేను ఆశాభావంతో చూస్తున్నాను.

# సోవియట్ సమాజమూ

ద్మిత్రి తులాయెవ్

రష్యన్ క్రైస్తవ మతావలంబన సహస్రాబ్ది ఉత్సవం గొప్ప చారిత్రక ప్రాధాన్యత గల ఘటన.

రష్యన్ ప్రజల్లోనే గాక, యావద్దేశంలో రష్యన్ ఆర్థోడాక్స్ చర్చి కార్య కలాపాలూ, దాని చరిత్ర పట్ల ఆసక్తి పెరిగింది. యిది ఈనాటి వాస్తవం.

రష్యన్, ఉక్రేనియన్, బెలోరష్యన్ సంస్కృతి చరిత్ర రష్యన్లు క్రైస్తవమతాన్ని అవలంబించిన తర్వాతనే ప్రారంభమైందని సోవియట్ యూనియన్‌లో అమిత గౌరవాన్ని చూరగొన్న సంస్కృతీ వేత్తల లో ఒకరైన అకడమీషియన్ ద్మిత్రి లిఖచేవ్ ఒకప్పుడు అన్నారు. ఈ మాట కొంత వరకూ వివాదగ్రస్త మైనది. ఎందువల్లనంటే, ప్రాచీన గాథలూ, ఐతిహ్యాలకాలం నుంచీ పుష్కిన్, గొగోల్‌ల నాటి వరకూ కూడా ఈ జాతుల సంస్కృతి అంతకు మునుపటి విగ్రహారాధకుల జానపద గాథల ప్రాతిపదికపై అభివృద్ధి చెందింది. ఐతే, అటువంటి ప్రకటన నేడు బహిరంగంగా చేయడం సాధ్యం కావడమే అంతకన్నా ముఖ్యమైనది. ఎందువల్లనంటే, రష్యన్ సంస్కృతికి క్రైస్తవ మతపీఠం దోహదం చేసిందన్న మాటను తోసిపుచ్చడం సరైనదని, నిర్వివాదమైనదని కూడ ఇటీవలి వరకూ బావిసూవచ్చాము.

అయితే, రష్యన్ ఆర్థోడాక్స్ చర్చి జీవితమూ, సమస్యల పట్ల ప్రబలమైన నూతన ఆసక్తి నేడు మానవ శాస్త్రాల లోని మేధావులకు మాత్రమే పరిమితం అయిందనుకోరాదు. సోవియట్ సమాజంలోని యితర సామాజిక విభాగాలూ, బృందాలలో సైతం ఈ దశలో సానుకూలమైన మార్పులు కనిపిస్తున్నాయి. అధికార్ల వైఖరి కూడా మారింది. మాస్కో, అఖిల రష్యా పెట్రియార్క్ పిమెన్ చెప్పినట్టుగా, పెరెస్త్రోయికా పరిస్థితుల్లో, ఈ సంబంధాలు సానుకూలంగా పర్యవసించే ధోరణి అగుపిస్తోంది.

1983 లోనే సోవియట్ ప్రభుత్వం రష్యన్ ఆర్థోడాక్స్ చర్చికి మాస్కోలోని దానిలోవ్ క్రైస్తవ మత సమూదాయాన్ని ఇచ్చివేసింది. దాన్నిప్పుడు రష్యన్ ఆర్థోడ్సాక్స్ చర్చి తన మత, పరిపాలక కేంద్రంగా ఉపయోగిస్తోంది. మరో సుప్రసిద్ధ మత విద్యా పీఠమైన 14 వ శతాబ్దినాటి అప్టినా పుస్టీన్ క్రైస్తవ మఠాన్ని సోవియట్ ప్రభుత్వం రష్యన్ ఆర్థొడాక్స్ చర్చికి గతయేడాది అప్పగించింది. ఇటీవలే 16 కొత్త రష్యన్ ఆర్థొడాక్స్ సమాజాలు సోవియట్ యూనియన్ లోని వివిధ ప్రాంతాల్లో నమోదయ్యాయి.

ఇలాంటి ఉదాహరణ లెన్నో ఉన్నాయి. కాని జీవితంపట్లా, భిన్నమత విశ్వాసాలు గలవారు మిలియన్ల కొద్దీ ఉండటం చారిత్రక వైపరీత్యం కాదు సరికదా, అది చరిత్ర వాస్తవమన్న విషయం పట్లా నూతన దృక్పథం అతిముఖ్యమైనది.

చర్చికి, మన సోషలిస్టు రాజ్యానికీ మధ్య సంబంధాలు రూపొందిన ఇటీవలి కఠోర మైన గతాన్ని కొందరు ఈ సందర్భంగా గుర్తు చేసుకోకుండా ఉండజాలరు. ఆ విషయాన్ని మనం కాదనడం లేదు. 1920 లు, 1930 లలో దేశంలో అనేక విధ్వంసక ఘర్షణలు జరిగాయి. వాటినుండీ కొన్ని గుణ పాఠాలను నేర్చుకున్నాము. అయితే, ఇప్పుడు "ఉగ్ర నాస్తిక వాదం" దశ గడచిపోయి, మత విశ్వాసాలు గలవారికీ, నాస్తికులకూ మధ్య పొరపొచ్చాలు లేని సంబంధాలు ఏర్పడినందువల్ల ఇకముందు ఘర్షణలు ఉండబోవని నమ్మడం అమాయకత్వం అవుతుంది.

చర్చిపట్ల అధికారుల వైఖరిలో గుణాత్మక మైన మార్పు రావడం ముఖ్యమైన విషయం.

# రష్యన్ ఆర్థోడాక్స్ చర్చి



**మాస్కో పరిసరాల్లోని బాలల వేసవి విశ్రాంతి శిబిరంలోని సోవియట్ - అమెరికా బాలబాలికలతో రష్యన్ ఆర్థొడాక్స్ చర్చి మెట్రోపాలిటన్ పితిరిమ్ (ఎడమవైపు నుండి రెండవవ్యక్తి)**

మన ప్రజల్లో అధిక సంఖ్యాకులు భావజాల పరంగా నాస్తికులని మన నమ్మకం. ఈ నాస్తికత్వానికి సత్యానికి దారితీసే చారిత్రక దృక్పథం ఉంది. ఇది ఎంతో క్రియాశీలంగా ఉండింది. యిక ముందు ఉంటుంది. అయితే యిప్పుడు, సోషలిస్టు సమాజాన్ని నిర్మించడంలో సుదీర్ఘ బాధాకర అన్వేషణలూ, వైఫల్యాలూ, విజయాల అనంతరం ఇప్పుడు, మన భావజాలపర నాస్తికత్వం సోషలిస్టు ప్రపంచ దృక్పథానికి గట్టి పునాదుల్లో ఒకటిగా ఉంటూనే, మన సమాజ క్లిష్టతర, గాఢతర వాస్తవాలను అర్థంచేసుకోవడంలో అనుభవ రీత్యా, ఆచరణరీత్యా సుసంపన్నమైంది. ఈ వాస్తవాలను గురించి మనకు 1920 లలోను, 1930 ల లోను, ఆ తర్వాతి మన అస్తిత్వ కాలంలో లేక ఒక విధంగా చెప్పాలంటే, మనుగడకై పాటు పడిన కాలంలో మనకు తెలియదు.

బైబిల్ బోధలకూ, మన నాస్తిక దృక్పథానికీ సామరస్యం కుదర్చడం చాలా కాలంగా ఉభయ పక్షాలకూ సాధ్యం కాలేదు. కాని, ఇప్పుడది సాధ్యమూ, వాస్తవమూ అవుతోంది. యిది మున్ముందు జరుగనున్న ఉత్సవాలకు తోడ్పడుతుంది.

సోవియట్ ప్రజల దృష్టిలో చర్చికి ఎంతో విలువ ఉంది. ప్రజలకు, అధికారులకు చర్చితో సంబంధాలు క్లిష్టంగా ఉండిన సమయంలో కూడా చర్చి, వారి ప్రశంసలను పొందింది. అది చర్చి చేస్తున్న శాంతి సాధనా కృషి, క్రైస్తవ శాంతికాముక స్ఫూర్తితో చర్చి చేసిన మేలుకు మన సమాజం లోని అధిక సంఖ్యాక నాస్తికులు కృతజ్ఞులుగా ఉన్నారు. పరస్పర, యితోధిక సదవగాహన కోసమూ, భూమ్మీద శాశ్వత సుస్థిరశాంతికి హామీ యివ్వడం కోసమూ సోవియట్ పౌర వర్గాలకూ, పాశ్చాత్య దేశాల పౌర వర్గాలకూ మధ్య చర్చల ఫలదాయకతకు రష్యన్ ఆర్థొడాక్స్ చర్చి మంచి సేవ చేసింది.

విదేశాంగ విధాన సమస్యలు

# ప్రాంతీయ ఘర్షణలూ, ప్రపంచయుద్ధ ప్రమాదమూ

ఎం. పొనమర్యోవ్

- మన భూగోళాన్ని పీల్చి పిప్పిచేసే గాయాలు
- సత్సంకల్పముంటే సమస్యలను పరిష్కరించడం సాధ్యమే
- ఘర్షణల నిర్మూలన వల్ల అందరూ లాభపడతారు.

1988 ఒక ప్రత్యేకతగల సంవత్సరమని నా అభిప్రాయం. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 19 వ అఖిలయూనియన్ సమావేశం పునర్వ్యవస్థీకరణలో మరో దశకు నాంది పలికింది సోవియట్-అమెరికా సంబంధాల అభివృద్ధివల్ల నాల్గవ శిఖరాగ్ర సమావేశం సాధ్యమైంది ఐ.ఎన్.ఎఫ్ సంధి ప్రకారం రెండు రకాల అణ్వస్త్రాలను ధ్వంసం చేస్తున్నారు. ఈ సంధి సంపూర్ణ అణ్వస్త్ర విసర్జన పథంలో ఒక ప్రముఖ ఘట్టం.

1988 సంవత్సరానికి గల ప్రత్యేకతకు యితర కారణాలు కూడా వున్నాయి. మన భూగోళాన్ని పీల్చి పిప్పిచేసే అనేక ప్రాంతీయ ఘర్షణలను పరిష్కరించడంలో గణనీయమైన ప్రగతి ప్రారంభమైంది.

ఈ ఘర్షణలకు కారణాలు విభిన్నమైనవే అయినప్పటికీ వాటికి వుమ్మడి లక్షణాలున్నాయి. అపార ధన, ప్రాణనష్టం వీటన్నిటిలో ముఖ్యంగా కనిపిస్తోంది. యీ ఘర్షణల్లో 10-20 మిలియన్ల మంది చనిపోయారని

అంచనా. యీ యుద్ధాలు తీవ్ర సామాజిక, ఆర్థిక, తదితర యిబ్బందులు గల తృతీయ ప్రపంచదేశాల్లో జరుగుతున్నాయి.

అంతేకాదు, యీ ప్రాంతీయ ఘర్షణలు సమస్త మానవాళికి ముప్పుతెచ్చే ప్రమాదాన్ని సృష్టిస్తున్నాయి. స్థానిక ఘర్షణలు ఏవైనా సరే ప్రపంచ యుద్ధానికి దారితీయవచ్చు. ప్రపంచ యుద్ధమే జరిగితే అది మానవ నాగరికతను తుడిచి పెడుతుంది. యీ ప్రాంతీయ ఘర్షణలను సామ్రాజ్యవాదదేశాలే పురికొల్పుతున్నాయి.

ఈ ప్రాంతీయ ఘర్షణల నుండి బయటపడే మార్గమేదీ లేనట్టు కనిపించింది. కాని గత సంవత్సరం ప్రారంభంనుండీ, వీటి పరిష్కారానికి ఆశాజనక సూచనలు కనిపించాయి. నూతన రాజకీయ ఆలోచనా ధోరణి అంతర్జాతీయ రంగంలో ముందుకు సాగుతోంది. యీ ఘర్షణల్లో తల మున్కలైన రాజ్యాలు జాతీయ సామరస్య విధానాన్ని ప్రకటించాయి. యీ విషయంలో ఐ.రా.స గొప్ప దోహదం చేసింది.

అఫ్ఘనిస్తాన్ పరిస్థితికి ఒక రాజకీయ పరిష్కారం గురించిన జెనీవా ఒప్పందాలు ఐ.రా.స ఆధ్వర్యంలోనే కుదిరాయి. యీ ఒప్పందాల ప్రాతిపదికపైనా, అఫ్ఘనిస్తాన్ నాయకత్వం ప్రకటించిన జాతీయ సామరస్య విధానం దృష్ట్యా సోవియట్ యూనియన్ అఫ్ఘనిస్తాన్ నుండి తన సైన్యాల వుపసంహరణను ప్రారంభించింది. జెనీవా ఒప్పందాలను పూర్తిగా వుల్లంఘిస్తూ అడ్డుకొట్టే విధానాన్ని పాకిస్తాన్ అవలంబిస్తున్నప్పటికీ ఆ ఒప్పందాలను అమలుపర్చడానికి ఆఫ్ఘన్ ప్రభుత్వం చేయగలిగినదంతా చేస్తున్నది.

దాదాపు ఎనిమిదేళ్లుగా సాగుతున్న ఇరాన్-ఇరాక్ యుద్ధాన్ని నిలుపుచేయడానికి కూడా ఐ.రా.స యెంతో కృషి సల్పింది. ఐ.రా.స సంస్థల్లోనూ, వివిధ అంతర్జాతీయ వేదికలపైనా సుదీర్ఘమైన, నిరర్థకమైన చర్చ జరుగుతోందని పత్రికలు ఎన్నిసార్లు ప్రచురించాయని! అయినా ఇరాన్-ఇరాక్ సాయుధ ఘర్షణపరిష్కారం కోసం సైనిక పరిశీలకుల బృందాన్ని నియమించడానికి సంబంధించిన నిర్ణయం చేయడానికి భద్రతా మండలికి కేవలం మూడు నిమిషాలు మాత్రమే పట్టింది.

ఆఫ్రికా' దక్షిణ ప్రాంతంలోని పరిస్థితిని మెరుగు పర్చడానికి అంగోలా, క్యూబా, దక్షిణాఫ్రికా, అమెరికాలు అంగీకారానికి వచ్చాయని తెలిసి ప్రపంచ ప్రజానీకం సంతసించింది. నమీబియాకు స్వాతంత్ర్యాన్ని యివ్వడానికి, యీ ఖండంలోని నైరుతి భాగంలో శాంతిని నెలకొల్పడానికి అవసరమైన చర్యలను తీసుకునేందుకు యీ పక్షాలు అంగీకరించాయి. భద్రతా మండలి 435 వ తీర్మానానికి కచ్చితంగా కట్టుబడి వుంటాననీ, అంగోలా నుండి తన సైన్యాలను వుపసంహరించుకుంటానని దక్షిణాఫ్రికా తన నిబద్ధతను ప్రకటించగా, అంగోలా నుండి క్యూబా సైన్యాలను పూర్తిగా వుపసంహరించే ఒప్పందంపై సంతకాలకు సిద్ధమేనని అంగోలా, క్యూబాలు పునరుద్ఘాటించాయి.

ప్రపంచంలోని యీ భాగంలో ఒక పరిష్కారం రూపుగొన్నది. నమీబియా ప్రజలు చాలా కాలంగా పెట్టుకున్న ఆశలు ఫలించనున్నాయి. స్వాతంత్ర్యాన్ని పొందిన తర్వాత అంగోలా ప్రజలు మొట్టమొదటి సారిగా శాంతియుత జీవనం గడపనున్నారు. అక్కడ కూడా భద్రత విజయం సాధించి తీరుతుంది.

ఆగ్నేయాసియాలో కూడా భద్రత విజయం సాధించితీరాలి. చాలా కాలంగా యిబ్బందులకు గురౌతున్న కంపూచియాలో జాతీయ సామరస్యం బలం పుంజుకుంటోంది. యిందులో ఆసక్తిగల రాజ్యాల మధ్య బొగోర్ (ఇండోనీషియా)లో జరిగిన ఇష్టాగోష్ఠి సమా

వేశం యీ దిశలో ఒక ప్రధాన ఘట్టం. కంపూచియా సమస్యను శాంతియుతంగా పరిష్కరించుకోవాలనే, నేరాలకు పాల్పడ్డ పోల్‌పాట్ ముఠా అధికారంలోకి రాకుండా నిరోధించాలనే కంపూచియా ప్రభుత్వ వైఖరిని యీ సమావేశంలో పాల్గొన్నవారు బలపర్చారు. ఈ సమస్య పరిష్కారానికి వియత్నాం హృదయ పూర్వకమైన దోహదం చేస్తోంది. కంపూచియా నుండి తన వలంటీర్లను ఉపసంహరించుకునే పథకాన్ని అది ప్రపంచానికి చాటి చెప్పింది. దానికి అది కటిబద్ధమై వుంది.

కంపూచియాలో శాశ్వత శాంతి గురించి చెప్పడం తొందర పాటే అవుతుంది, కాని అక్కడి పరిస్థితులు ఆశాజనకంగా వున్నాయి.

పరిష్కారానికి చేరువలో వున్న అనేక యితర ఘర్షణలున్నాయి. వీటిలో సోమాలియా, ఇథియోపియాల మధ్య ఘర్షణ ఒకటి. యీ రెండు దేశాలూ దౌత్య సంబంధాలను పునరుద్ధరించుకున్నాయి. యుద్ధ ఖైదీలను మార్పిడి చేసుకుంటున్నాయి, యితర సమస్యలను కూడా పరిష్కరించుకుంటున్నాయి.

అయితే పరిష్కారం కనుచూపు మేరలో లేని యితర ఘర్షణలు కూడా వున్నాయి. అరబ్ భూభాగాలను ఇజ్రాయిల్ యింకా తన ఆక్రమణలో వుంచుకుంది. పాలస్తీనియన్ల హక్కులను గుర్తించ నిరాకరిస్తోంది. యీ మండలంలోని సమస్యల పరిష్కారం కోసం వుద్దేశించిన అంతర్జాతీయ సమావేశం యేర్పాటుకు ఆమోదయోగ్యం కాని షరతులను పెడుతోంది.

నేను మరోసారి చెప్పదలచుకున్నాను: ప్రాంతీయ ఘర్షణల నిర్మూలనవల్ల యెవరికీ పోయేదేమీ వుండదు. వాటి పరిష్కారం వల్ల అంతర్జాతీయ భద్రత బలపడుతుంది.

(క్రాస్నయా జ్వెజ్దా పత్రిక నుండి—సంక్షిప్తం)

# సోవియట్,

**తాత్యానా షొమ్యాన్**

ప్రపంచ రాజకీయాల్లో నూతన ఆలోచనా విధాన సూత్రాల ఆవశ్యకత గురించి మనం పేర్కొన్నప్పుడు, మానవుని భద్రతకూ, సమగ్ర వికాసానికీ, అతని ఔన్నత్యం పట్ల గౌరవ భావానికీ తగిన పరిస్థితులు నెలకొల్పడమని మనందరి భావం. భిన్న సామాజిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులుగల బహువిధదేశాల మధ్య మానవతారంగంలో సహకారాభివృద్ధికి ప్రత్యేక ప్రాముఖ్యముందని కూడ దాని అంతరార్థం.

అంతర్జాతీయ సంబంధాలను మానవతాయుతంగా చేసేందుకు, వ్యక్తిగత, స్థానిక, జాతీయ ప్రాంతీయ ప్రయోజనాలపై సార్వత్రిక విలువల ఆధిక్యతను స్థిరపరచడానికి సోవియట్ యూనియన్, భారతదేశం ఒక ముఖ్య దోహదం కూర్చాయి. అది అణ్వస్త్ర రహిత, హింసారహిత ప్రపంచస్థాపన సూత్రాలపై వాటి సంయుక్త ప్రకటన. వ్యక్తి సమరసవికాసానికి బాట వేయాలనీ, సమాజం ఉనికికి అహింసను ప్రాతిపదికగా చేయాలనీ అది పిలుపునిచ్చింది. పెరుగుతున్న ప్రపంచ జనాభాకు తిండి తీర్థాలు లభించేలా చూడటం, నిరక్షరాస్యతను నిర్మూలించడం, పర్యావరణాన్ని కాపాడటంవంటి ప్రపంచ సమస్యల పరిష్కారానికి మానవాళి పాదార్థిక మేధాసంపత్తి ఉపయోగపడాలని ఢిల్లీ ప్రకటన చెబుతోంది. శాంతి, పరస్పర గౌరవ, సహనభావాల స్ఫూర్తి కలిగేలా దేశదేశాలను ప్రబుద్ధం చేయాలని సోవియట్‌యూనియన్, భారతదేశాలు పిలుపిచ్చాయి.

దాదాపు సామాజిక-రాజకీయ, ఆర్థిక సాంస్కృతిక, శాస్త్రీయ రంగాలన్నిటి లోనూ సోవియట్ భారత సహకారం పెంపొందుతూంది. మానవాళిని అణుయుద్ధ ప్రమాదం నుంచి కాపాడటం, పెద్ద, చిన్న దేశాల సార్వభౌ

# భారత పుత్సవాల సాన్నకాల సవిత్రాలు



మాస్కోనది ఒడ్డున భారతదేశ వయొలినిస్టు ఎల్. సుబ్రమణ్యం

తాష్కెంట్‌లో మైత్రీ పూర్వక సమావేశాలు

**తాత్యానా షామ్యాన్ సోవియట్ యూనియన్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ తాలూకు ప్రాచ్య విషయాధ్యయన సంస్థలో భారత పరిశోధనా కేంద్ర శాస్త్రకార్యదర్శి, సామాజిక శాస్త్రాల్లో సోవియట్- భారత సహకార కమిషన్ శాస్త్రకార్యదర్శి**

## సోవియట్, భారత పృథువాల

# సానుకూల ఫలితాలు

మత్వాన్ని ప్రాదేశిక సమగ్రతను గౌరవించే ప్రాతిపదికపై ప్రాంతీయ ఘర్షణలను శాంతి యుతంగా రాజకీయ పద్ధతుల్లో పరిష్కరించటం, మనకాల తక్షణ సమస్యలపట్ల ఉమ్మడి వైఖరులను లేదా ఒకదానికొకటి సన్నిహితమైన వైఖరులను రూపొందించడం—ఈ లక్ష్యాలతో అంతర్జాతీయ రంగంలో రెండుదేశాలూ రాజకీయంగా సహకరించుకొంటున్నాయి. వర్తక, విజ్ఞానశాస్త్ర, ఇంజనీరింగ్, ఆర్థిక, సాంస్కృతిక, వైద్య, క్రీడారంగాలకు కూడ వాటి పరస్పర లాభధాయకమైన బహుముఖ సహకారం విస్తరించింది.

సామాజిక శాస్త్రాల్లోనూ, సాంస్కృతిక రంగంలోనూ సహకరించు కోవడంలో భారత, సోవియట్ దేశాలకు విస్తారమైన మంచి అనుభవ ముంది. రెండు దేశాల పరస్పర సంబంధాల ఉన్నత స్థాయీ, స్వభావమూ వల్ల సోవియట్ యూనియన్‌లో భారతదేశ ఉత్సవం, భారత దేశంలో సోవియట్ యూనియన్ ఉత్సవం వంటి బృహత్ఘటనలకు బాట యేర్పడింది. గాయక, రంగస్థల నటబృందాల మార్పిడి, భారతదేశంలో సోవియట్ సర్కస్ ప్రదర్శనలు, చలన చిత్రోత్సవాలు, యువజన సమావేశాలు మొదలయిన వాటిని తలపెట్టిన సాంస్కృతి కోత్సవాల కార్యక్రమమేకాక, ఈ ఉత్సవాల పరిధిలో రెండు దేశాల శాస్త్రజ్ఞుల సమావేశాలు జరిగాయి.

సోవియట్-భారతీయ ఆర్థిక, శాస్త్రీయ, సాంకేతిక సహకారానికి, స్వేచ్ఛా, సామాజిక ప్రగతికై పోరాటంలో సోవియట్, భారత ప్రజల మధ్య సంబంధాలకూ అంకితమైన వర్క్‌షాపులు, గోష్ఠులు అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం 70వ వార్షికోత్సవ సందర్భంగానూ, భారత స్వాతంత్ర్య దిన 40వ వార్షికోత్సవ సందర్భంగానూ జరిగాయి. అమోఘంగా సాగిన వర్క్‌షాపుల్లో రెండు దేశాలకు చెందిన ప్రముఖ సామాజిక శాస్త్ర పరిశోధకులు ప్రఖ్యాత పౌరవ్యవహర్తలు, రాజకీయవేత్తలు, పాత్రికేయులు పాల్గొన్నారు.

మాస్కోలో 1988 మే లో వర్క్‌షాపు జరుగుతున్నప్పుడు, దానిలో, సమాచార ప్రసార సాధనాలూ, రెండు దేశాల సహకార పటిష్ఠీకరణలో వాటి పాత్ర గురించిన విభాగానికి నేను వెళ్లాను. చర్చలు సంపూర్ణమైన చిత్తశుద్ధితో, దాపరికం లేకుండా జరిగాయి. సోవియట్ పక్షాన అలెగ్జాండర్ బొవిన్, యూరీ బందూర, ఓలెగ్ కిత్సెంకో, లిదియాగ్రఫోవా, గోస్టెలేరేడియో ఉపాధ్యక్షుడు క్రవ్‌చెంకో లాంటి ప్రసిద్ధ పాత్రికేయులు, రేడియో, టెలివిజన్ జర్నలిస్టులు అందులో పాల్గొన్నారు. వారు పెరిస్త్రోయికా, గ్లాస్నోస్త్ మొదలయిన విషయాలపై మాట్లాడారు. భారత పక్షానికి ప్రాతినిధ్యం వహించిన వారిలో నిఖిల్ చక్రవర్తి, భవానీసేన్‌గుప్త, ఎన్.ఎల్.చౌలా వున్నారు. వారు సోవియట్ యూనియన్‌లో వున్నప్పటి తమ అనుభవాలను, తమ దేశంలో తమకు ఎదురవుతున్న ఇబ్బందులను వివరించారు. ఈ విధమైన అభిప్రాయాల మార్పిడి, భారతదేశంలో సోవియట్ యూనియన్‌ను గురించీ, సోవియట్ మానవుని గురించీ, సోవియట్ యూనియన్‌లో భారతీయుని, అతని మహా దేశాన్ని గురించీ నిజమైన అవగాహనకు తోడ్పడింది.

సంప్రదాయానుసారం, భారత స్వాతంత్ర్యదిన 40వ వార్షికోత్సవం భారత జాతీయకాంగ్రెస్ పార్టీ శతవార్షికోత్సవం, అక్టోబరు రష్యన్ విప్లవ 70వ వార్షికోత్సవం సందర్భంగా అటు భారత దేశంలోనూ, ఇటు సోవియట్ యూనియన్‌లోనూ వర్క్‌షాప్‌లు, గోష్ఠులు జరిగాయి.

సామాజిక శాస్త్రాల్లో సహకారానికి సంబంధించిన సోవియట్-భారత కమిషన్‌కు ఉభయదేశాల పరస్పర సహకార సమన్వయీకరణలో ఒక ముఖ్య పాత్ర వుంది.




కలకత్తాలోని విక్టోరియా మెమోరియల్ వద్ద సోవియట్ బ్రాస్ బ్యాండ్

పరిశోధన స్థితిగురించిన సమాచారం ఒకరి కొకరు అందజేయడం, పుస్తకాల, పత్రికల ఆదానప్రదానాలు, శాస్త్రజ్ఞుల మార్పిడి, ఉభయులకు ఆసక్తికరమైన సమస్యలపై వర్క్‌షాపుల, గోష్ఠుల ఏర్పాటు ఈ పరిశోధక కార్యక్రమంలోని అంశాలు.

ఈ కమిషన్ 40 కి పైగా అటువంటి సమావేశాలను ఏర్పాటు చేసింది. వీటికి రెండుదేశాల శాస్త్రజ్ఞులు హాజరయారు.

జాతీయ విముక్తి ఉద్యమాలు, పౌర వ్యవహారాల చింతన, ప్రణాళికారచన, ఆర్థికాభివృద్ధి, రైతుల పోరాటం—వీటిపై మాస్కోలో 1988 సెప్టెంబరులో మూడు వర్క్‌షాపులు యేర్పాటయ్యాయి: దిగ్విజయంగా జరిగిన వీటిలో రెండు దేశాలకు చెందిన ప్రముఖ శాస్త్రజ్ఞులు పాల్గొన్నారు. వారు తమ అభిప్రాయాలను పరస్పరం తెలుపుకోవడం(ప్రత్యేకించి, ప్రణాళికా రచన, ఆర్థికాభివృద్ధిలో) శాస్త్రానికీ, ఆచరణాత్మక కృషికీ ఉపయోగపడుతుంది.

అదే నెలలో సోవియట్-భారత్ కమిషన్ ప్లీనరీ సమావేశం జరిగింది. అది ఫలప్రదంగా చిత్తశుద్ధి, పరస్పర విశ్వాస వాతావరణంలో సాగింది. సహకార విస్తరణకు నూతన రూపాల వద్ధతులకోసం, వర్క్‌షాపులకు, చర్చలకు కొత్త విషయాలకోసం, మరింత ప్రగాఢమైన సంయుక్త పరిశోధనలకోసం ఉభయదేశాల మధ్య మరింత ముమ్మరంగా శాస్త్రజ్ఞుల మార్పిడులకోసం రెండు పక్షాలూ అన్వేషించాయి.

సహకార కీలక రూపాలివి: ద్విపక్షాల వర్క్‌షాపులు, అవి జరిగిన తరువాత నివేదికల ప్రచురణ; ముఖ్యమైన విషయాలపై సంయుక్త కృషి, తదుపరి సంయుక్త గ్రంథ రచన :అలాంటి రెండు విషయాలపై ఒప్పందం కుదిరింది — అవి, శాంతికై, అభివృద్ధికై పోరాటంలో భారతదేశం, సోవియట్

సోవియట్, భారత పుస్తకాల

# సానుకూల ఫలితాలు

యూనియన్;
బహుళజాతి సమాజంలో
సాంస్కృతిక ఏకీకరణ.
సోవియట్‌యూనియన్
విజ్ఞాన శాస్త్రాల అకాడమీ,
భారతదేశ ఉన్నత
యూనివర్సిటీ కమిషన్‌ల ద్వారానే కాక,భారత దేశ శాస్త్రీయ కేంద్రాలకు, సోవియట్‌యూనిన్ ఉన్నత విద్యాసంస్థలకు మధ్య యువపరిశోధకుల, శాస్త్రజ్ఞుల మార్పిళ్ళు కూడా అవసరమని పలుసార్లు నొక్కి చెప్పడం జరిగింది. ఇంగ్లీషు భాషలోనూ, భారతీయ భాషల్లోనూ ప్రచురితమైన సోవియట్ పుస్తకాలకు భారత దేశంలో గల గిరాకీని తీర్చడంలో ముఖ్యమైన సహకార రూపాన్ని తగినంత వినియోగించడం జరగలేదు. శోచనీయమైన విషయమేమంటే, మన ప్రచురణావకాశాలు పరిమితమైనవి.

ప్రాచీనకాలంనుంచి భారత సోవియట్ ప్రజల మధ్య, నరవర్గ- సాంస్కృతిక సంబంధాలపై రచనలవంటి చారిత్రక శాస్త్రాలు, పురావస్తు శాస్త్ర, నరవర్గ శాస్త్ర పరిశోధన సాంకేతిక విధానాలు, పద్ధతులలో ఆదాన ప్రదానాలు, భారతదేశంలో విముక్తి ఉద్యమం గురించీ, రష్యాలోని విప్లవోద్యమం గురించీ ఇతోధిక అధ్యయనాలు, రష్యన్-భారత, సోవియట్-భారత సంబంధాల చరిత్ర (ఇందుకు రెండు దేశాల్లోని పురావస్తు నిలయాల్లోని పత్రాలు మొదలయిన వాటిని ఉపయోగించుకోవాలి), నరవర్గ శాస్త్రం (అల్పసంఖ్యాక నరవర్గాల అభివృద్ధి, సాంస్కృతిక ఏకీకరణ, కుటుంబ పాత్ర మొదలయినవి), అర్థశాస్త్రం, ఆర్థిక భూగోళశాస్త్రం (ప్రభుత్వ, సహకార సంస్థల మేనేజిమెంటు, వ్యవసాయాభివృద్ధిలో పారిశ్రామికీకరణ పాత్ర, చిన్న పట్టణాల సమస్యలు, సోవియట్-భారత ఆర్థిక సహకారం మొదలయిన విషయాలు) అంతర్జాతీయ సంబంధాలతో సహా, రాజకీయ శాస్త్రాలు, తత్వశాస్త్రాలు, న్యాయశాస్త్రం, భాషాశాస్త్రం, కళలు (సోవియట్-భారతీయ సాహిత్య సంబంధాలు, ప్రస్తుత సంస్కృతిలో ఆధునికత, కళల సంయోగం, మొదలయినవి)
ఈ అన్ని విషయాల్లో సహకార రంగాలను కమిషన్ నిర్దేశించింది. భారతదేశంలోనూ, సోవియట్ యూనియన్‌లోనూ మార్చిమార్చి ఏడాదికి నాలుగు వర్క్‌షాపుల యేర్పాటును కొనసాగించ తలపెట్టారు.

సోవియట్ సమాజంలో పెరిస్త్రోయికాలోని రాజకీయ, ఆర్థిక, సైద్ధాంతిక, విదేశాంగ విధాన పరమైన సమస్త అంశాలపట్ల భారత ప్రజలు ఆసక్తి చూపుతున్నారు. ప్రాంతీయ వ్యవహారాల భారతీయ కేంద్రం, సి.పి.ఎస్.యు. 27వ మహాసభ పత్రాలను విశ్లేషించడానికి వర్క్‌షాపులను, గోష్ఠులను, "రౌండ్ టేబిల్" చర్చలను యేర్పాటు చేసింది. ఢిల్లీలో ఏర్పాటయిన అలాంటి వర్క్‌షాప్‌కు నేను హాజరయాను. కాబట్టి, నేనొక విషయం నమ్మకంగా చెప్పగలను — సోవియట్‌లోని ఘటనలు మనకే కాకుండా, ప్రపంచ ప్రజలకూ, అంతర్జాతీయ రంగంలో సోషలిజం ప్రతిష్ఠ బలపడటానికీ ఎంతో ముఖ్యమైనవి. సోవియట్ యూనియన్‌లో పెరిస్త్రోయికాలోని విదేశాంగ విధాన అంశంపైనే కాకుండా, కేవలం మన ఆంతరంగిక వ్యవహారాల్లా కనిపించే వాటిపై కూడ ఆధారపడిన అంచనా ఇది. సామాజిక వ్యవస్థల్లో, జీవిత విధానంలో అలవాట్లల్లో మన దేశాల ప్రజల మధ్య భేదాలు ఉన్నప్పటికీ, అనేక ఆంతరంగిక రాజకీయ, సామాజిక, ఆర్థిక, నరవర్గ, జాతీయ, మత సమస్యలను పరిష్కరించడంలో వారికి సానుకూల, ప్రతికూల. అనుభవాలు రెండూ వున్నాయి. ఆ సమస్యలగురించిన సమాచారం పరస్పరం తెలుసుకోవడం, వాటిని గురించి కలిసి చర్చించడం మన దేశాలకు ఎదురవుతున్న క్లిష్టమైన అభివృద్ధి

సమస్యల పరిష్కారానికి ఆచరణరీత్యా ముఖ్యం కావచ్చు.

భారత, సోవియట్ దేశాల ఆర్థికవేత్తలు కూడ ఒకరి అనుభవాన్ని మరొకరు తెలుసు కోవడం చాలాముఖ్యం. ఎందువల్లనంటే, రెండు దేశాల ఆర్థిక వ్యవస్థల్లో తేడాలున్నప్పటికీ, ఆర్థికాభివృద్ధి, ప్రాంతీయాభివృద్ధి మొదలయిన వాటికి సంబంధించిన ప్రణాళికా రచనలో సంయుక్త పరిశోధన మన దేశాలకు లాభదాయకం కాగలదు; ఒక కొత్త ప్రాతిపదికపై ఆర్థిక, శాస్త్రీయ, సాంకేతిక రంగాల్లో సహకారాన్ని పెంపొందించగలదు. ప్రణాళికారచన, ఆర్థికా భివృద్ధికి సంబంధించిన విషయంపై యేర్పా టయిన వర్క్‌షాపు (1988 సెప్టెంబరులో మాస్కోలో జరిగినది) అంత ఫలప్రదం కావడం యాధృచ్ఛికం కాదు — సోవియట్ యూని యన్‌లో ఆర్థిక పునర్వ్యవస్థీకరణను మరింత కూలంకషంగా అధ్యయనం చేయాలని దానిలో పాల్గొన్నవారు నిర్ణయించారు. నేటి అంతర్జాతీయ పరిస్థితిలోని ప్రపంచ, ప్రాంతీయ అంశాల గురించీ, ద్వైపాక్షిక భారత-సోవియట్ సంబంధాల గురించీ ఉభయదేశాల ప్రముఖ శాస్త్రజ్ఞులు, పౌర ప్రముఖులు ఈ ఉత్సవాల సందర్భంగా తమ అభిప్రాయాలను పరస్పరం తెలుపుకొన్నారు. ఉన్నతస్థాయి శాస్త్రజ్ఞులు, పాత్రికేయులు, సోవియట్ యూనియన్, భారతదేశ విదేశాంగ విధానాల భావనలను రూపొందించడంలోనూ, వాటిని అనుసరించడంలోనూ ప్రత్యక్షపాత్ర వహించే రాజకీయవేత్తలు ఇందులో పాల్గొన్నారు. ఈ స్థాయిలో అభిప్రాయాల మార్పిడి ఉభయ దేశాలకు ముఖ్యమైనదని ఇది ధ్రువపరుస్తుంది.

ఆసియా-పసిఫిక్ మండలంలో పరిస్థితిపై, దాని స్థిరీకరణపై 1986 లో వ్లాదివొస్తోక్‌లో మిహయీల్ గోర్బచేవ్ చేసిన ప్రతిపాదనలు, అయనా, భారత ప్రధాని రాజీవ్‌గాంధీ 1986 లో సంతకం చేసిన ఢిల్లీ ప్రకటన — వీటిపై సమావేశ భాగస్వాములు దృష్టి కేంద్రీకరించారు. తరువాత తీవ్రమైన చర్చలు జరిగాయి. ఆ విస్ఫోటన ప్రాంతంలో శాంతి, సుస్థిరతలకు హామీ కల్పించే రూపాలూ, పద్ధతులపట్ల ఉభయపక్షాల దృక్పథాల్లో సమానాంశాలూ, కొన్ని తేడాలూ ఈ చర్చల్లో ముందుకు వచ్చాయి. ఆ ప్రాంతంలో మన రెండు దేశాల విధానాలు శాంతి, సమస్త దేశాల ప్రజల భద్రత అనే లక్ష్యాభిముఖమైనవని వ్యక్తమయింది.

ఆసియా-పసిఫిక్ మండలంలో అంతర్జాతీయ సంబంధాలూ, భద్రతపై జరిగిన సమావేశాల పత్రాలు భారతదేశంలో గ్రంథరూపంలో వెలువడ్డాయి. అది అతిముఖ్యమైన విషయం. మనదేశంలో ప్రచురణల పద్ధతి ఎంత క్లిష్టమైనదంటే, సమకాలీన అత్యవసర సమస్యలపై సోవియట్, భారతీయ శాస్త్రజ్ఞుల ప్రసంగాలను రష్యన్ భాషలో త్వరగా ప్రచురించలేకపోతున్నాము. మన భారతీయ సహచరుల అనుభవాన్ని ఉపయోగించుకొని, బహుశా అలాంటి వాటిని ప్రచురించే కొత్త రూపాలను కనుగొనాలి. సామాజిక శాస్త్రాలలో సహకారానికి సంబంధించి 1988 సెప్టెంబరులో మాస్కోలో జరిగిన సోవియట్-భారత కమిషన్ ఏడవ ప్లీనరీ సమావేశం ఈ సంగతిని కూడ చర్చించింది. అంతర్జాతీయ సమస్యలపైనా, సోవియట్ -- భారత సంబంధాలపైనా యేర్పాటయిన పలు ద్వైపాక్షిక వర్క్‌షాపుల్లో పాల్గొన్న నా అనుభవాన్ని బట్టీ, సోవియట్-భారత కమిషన్ శాస్త్ర కార్యదర్శిగా నా అను భవాన్ని బట్టీ నేను సామాజిక శాస్త్రాల్లో మన సహకారం ఫలదాయకమైనదీ, ప్రగతి శీల మైనదని గట్టి ఆధారాలతో చెప్పగలను. ఈ రంగంలో మన భారతీయ సహచరులతో సంబంధాలను మరింత పటిష్ఠపరచుకోవడం మన కర్తవ్యం. వారిలో చాలామందితో మనకు స్నేహసంబంధాలున్నాయి. వారితో సమా వేశాల వల్ల ఉభయులం లాభపడుతున్నాము. మన ఉభయుల ఆత్మ విశ్వాసం పెరుగు తుంది. భారత, సోవియట్ దేశాల మధ్య సంబంధాల విషయంలో వాటికి గల శాశ్వత ప్రాముఖ్యం అదీ.

(8 వ పేజీ తరువాయి)

సోవియట్-భారత శిఖరాగ్ర సమావేశ ప్రకటనపై, భారతదేశంలో ఒక అణువిద్యుత్కేంద్ర నిర్మాణంలో సహకారం గురించిన ఒప్పందంపై మిహాయీల్ గోర్బచేవ్, రాజీవ్‌గాంధీలు సంతకాలు చేశారు.

ఈ పర్యటన సందర్భంగా సంతకాలు జరిగిన యితర పత్రాలు యివీ:

శాంతియుత ప్రయోజనాలకోసం దూర రోదసిని పరిశోధించి, వుపయోగించు కోవడంలో దీర్ఘకాలిక సహకారానికి సంబంధించిన ఒక ఒప్పందం.

వింధ్యాచల్ తాపవిద్యుత్కేంద్రం తాలూకు రెండోదశ నిర్మాణంలో సహకారాన్ని గురించి ఒప్పందం ద్వంద్వపన్ను విధానాన్ని తొలగించడం పై ఒక ఒప్పందం.

విద్యుచ్ఛక్తి పరిశ్రమలు నిర్మించడంలో ఆర్థిక, సాంకేతిక సహకారాన్ని గురించిన ఒక కరారునామా.

తనకూ, తన సహచర బృందానికీ స్నేహపూర్వక స్వాగతమిచ్చిన భారత ప్రభుత్వానికీ, ప్రజలకూ మిహాయీల్ గోర్బచేవ్ హృదయ పూర్వకంగా కృతజ్ఞతలు తెలియజేశారు.

సోవియట్ యూనియన్‌కు అధికారిక, మైత్రీ పూర్వక పర్యటనలు జరపాల్సిందిగా సోవియట్ నాయకత్వం తరఫున ఆయన రాష్ట్రపతి ఆర్. వెంకటరామన్‌నూ, ప్రధాని రాజీవ్‌గాంధీనీ ఆహ్వానించారు. పర్యటనలకు నిర్దిష్టమైన తేదీలు దౌత్య వర్గాల ద్వారా నిర్ణయమౌతాయి.

భారతదేశ పర్యటన ముగిసింతర్వాత మిహాయీల్ గోర్బచేవ్ మాస్కోకు వెళ్ళారు. ఆయనకు రాష్ట్రపతి భవన్‌లో లాంఛనపూర్వకమైన వీడ్కోలు యిచ్చారు. రాష్ట్రపతి ఆర్.వెంకటరామన్, తదితర వున్నతాధి కారుల నుంచీ మిహయిల్ గోర్బచేవ్, రైసా గోర్బచేవాలు వీడ్కోలు తీసుకొంటున్న సందర్భంగా సాయుధ దళాల మూడు సంయుక్త విభాగాలూ గౌరవ వందన సమర్పణ చేశాయి. సోవియట్ అధ్యక్షుని గౌరవార్థం ఫిరంగులు పేల్చడం జరిగింది

ప్రధాని రాజీవ్‌గాంధీ, సోనియాగాంధీ, తదితరులు ప్రముఖ అతిథులకు విమానాశ్రయంలో హృదయ పూర్వకంగా వీడ్కోలు యిచ్చారు.

**గమనిక : మిహాయీల్ గోర్బచేవ్ భారతదేశ పర్యటనకు సంబంధించి 1989 జనవరి సంచికలో మరిన్ని వివరాలు ప్రచు రిస్తాం.**

## పుస్తక ప్రపంచం

# రహస్యాలో అరణ్య పర్వం ప్రయాణం

ఇల్యా సుచ్ కోవ్
క్యాండిడేట్ ఆఫ్ సైన్స్ (చరిత్ర)

మహా భారతం మహా ఇతిహాసం మాత్రమే కాదు. యిది యావత్తు ప్రాచీన భారతీయ సంస్కృతి సంపద సమాహారం. యిది ప్రపంచ నాగరికతాభివృద్ధి పై ప్రభావం నెరిపింది, నెరపుతూనే ఉంది. యిది ఇండోనేషియా, శ్రీలంక, బర్మా, థాయిలాండ్, మలేషియా, సింగపూర్‌ల జానపద సాహిత్యం, సంప్రదాయాలు, పండుగలూ, పబ్బాల్లో జీవిస్తూనే ఉంది. చారిత్రక కాలాన్నిబట్టీ, సామాజిక, సాంస్కృతిక పరిసరాలను బట్టీ "మహాభారతం" ఇతివృత్తాలను అక్కడ వ్యాఖ్యానిస్తూ ఉన్నారు.

హెూమర్ "ఇలియడ్" "ఒడెస్సీ"లు యెంతబాగా తెలుసో, "మహాభారతం" కూడా సోవియట్ పాఠకులకు అంతబాగానూ తెలుసునంటే అతిశయోక్తి కాదు. మాస్కో ప్రచురణాలయాలు ఈ ప్రాచీన భారతీయ ఇతిహాసాన్ని తరచు ప్రచురిస్తూంటాయి. ఉదాహరణకు, గతకాలంలో ఒక్క ఖుదోజెస్త్వెన్నాయా లితరేచురా పబ్లిషర్స్ సంస్థే



"మహాభారతాన్ని" రెండు సార్లు ప్రచురించింది: "నరోద్నాయా బిబ్లియోతెకా పుస్తకపరంపరలో (1969), బిబ్లియోతెకా వ్సెమిర్నోయి లితరేచురీ పుస్తక పరంపరలో (1974). ఇప్పుడు నౌకా ప్రచురణ సంస్థ "మహా భారతాన్ని" పూర్తిగా అనువదించి ప్రచురించ బూనుకుంది. మూలగ్రంథాన్నే అనువదిస్తున్నారు. ఈ గ్రంథాన్ని సవివర వ్యాఖ్యానంతో ప్రచురిస్తున్నారు. అత్యంత విషయ సంభరితమైన "మహాభారతం"లోని మూడవ విభాగం, అరణ్యపర్వం యిప్పటికే ముద్రణాలయంనుండీ వెలువడింది. యిది పాండవులు అరణ్యవాసం చేసిన 12 సంవత్సరాల కాలాన్ని గురించి తెలిపేది. వారుపడిన కష్టాలను, నైతిక, తాత్విక సమస్యలను ఈ పుస్తకం నొక్కి చెబుతూ వర్ణిస్తోంది. ఈ పుస్తకం అనేక ప్రాచీన కథలపై ఆధారపడి రచించినది. ఈ కథల్లో ఒకటి శివునితో అర్జునుని యుద్ధాన్నీ, ఈ వీరుడు ఉరుము, మెరుపుల మధ్య, ఒక మెరిసే సాధనంలో గగనానికి ఎగియడాన్ని వర్ణిస్తోంది. ఈ కథపై ఆధారపడి సోవియట్ పండితుడు, ఎ.గోర్బోవ్‌స్కీ చర్చనీయమైన ఒక ఊహను ప్రతిపాదించారు చరిత్ర పూర్వ కాలంలోనే మానవుడు దూర రోదసి యాత్ర జరిపిఉండే అవకాశం ఉందనీ, మనకు తెలియని నాగరికత ఒకటి అప్పుడు ఉండేదనీ ఆయన ఊహ. దాన్ని బలపర్చుకునేందుకు ప్రపంచంలోని యితర ప్రాంతాల్లో జరిపిన తవ్వకాల ఫలితాన్ని పేర్కొన్నారు.

జోహాన్ వోల్ఫ్‌గాంగ్ వోన్ గేటె ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య, సంప్రదాయాల సయోధ్యను గురించి పేర్కొన్నారు. ఆయన యీ సయోధ్య క్రమానికి ఆద్యుడు. (యీ క్రమం బలంగా విస్తృతంగా నేటికీ అభివృద్ధి చెందుతోంది). 19వ శతాబ్దారంభంలో యూరప్ పాఠకులకు ప్రామాణిక ప్రాచ్య సాహిత్యంలోని కొన్ని ఉద్గ్రంథాల తొలి అనువాదాలు అందాయని ఆయన చెప్పారు. వాటిలో ప్రాచీన భారతీయ ఇతిహాసాలైన "మహాభారతం", "రామాయణం" ఉన్నాయి. తొలి జర్మన్, ఆంగ్ల అనువాదాల వల్ల యూరప్‌కు "మహాభారతం" గురించి 18 వ శతాబ్దాంతంలోనే తెలిసింది. అయితే, 1948 కి ముందు "మహాభారతం" పూర్తి అనువాదం ఇంగ్లీషులో మాత్రమే ఉండింది.

19వ శతాబ్దారంభంలో "మహాభారతం"లోని కథల్లో ఒకటైన "నలదమయంతి" కథను సుప్రసిద్ధ రష్యన్ కవి అయిన వాసిలి జుకోవ్‌స్కీ అనువదించారు. ఈ కథ అనువాదకుల్లో ఆయనే మొదటివారు. "ఆయన అనువాద భాష సంగీతభరితమై ఉంది. అది పరిపూర్ణతకు పరమావధి. ఈ కథకు జుకోవ్‌స్కీ అనువాదం చాలా స్వేచ్ఛానువాదం. ఆయన దీనికి వాడింది గ్రీక్ హెక్సా ఛందం, శ్లోకాలు కాదు. అయినప్పటికీ ఆయన ఉత్తేజ భరితమైన వ్యాఖ్యానంలోని ప్రతి పంక్తి లోనూ భారతీయ కవిత జవజీవాలతో అలరారింది" అని సోవియట్ సాహిత్య విమర్శకుడూ, అనువాదకుడూ ఎస్. లిప్కిన్ రాశారు. వాసిలీ

జుకోవ్‌స్కీయే స్వయంగా ఇలారాశారు: "మూల గ్రంథమే గనుక నాకు తెలీకుంటే, దీన్ని రష్యన్ పాఠకులకు పరిచయం చేయాలని అనుకోని ఉండను. మనసునాకట్టుకొనే ఈ కథను వారికి రష్యన్‌లో చెబుదామనుకుంటున్నాను అంతే."

నిజంగా సమర్థమైన, సరియైన "మహా భారతం" అనువాదాలు వెలువడింది సోవియట్ ప్రభుత్వ కాలంలోనే. ఈ భారతీయ ఇతిహాసాన్ని సంస్కృతం నుంచీ అనువదించిన వారిలో లెనిన్‌గ్రాడ్ ఇండాలిజిస్టు అయిన వి.ఐ.కాల్యానోవ్ ఒకరు. తుర్క్‌మేనియాకు చెందిన బి.ఎల్.స్మిర్నోవ్ "మహాభారతం" లోని అతి ప్రధాన భాగాలను అను వదించారు. అవి 1955-1963 లో స్మిర్నోవ్ ఉపోద్ఘాతం, వాఖ్యానాలతో వెలువడ్డాయి. ప్రస్తుతం, నౌకా ప్రచురణాలయ ప్రాచ్య సాహిత్య విభాగం "మహాభారతాన్ని" మరోసారి ప్రచురించ నారంభించింది.

అరణ్య పర్వాన్ని సంస్కృతం నుంచీ అనువదించిన వై.వి.వాసిల్కోవ్, ఎస్.ఎల్.నెవెలేవాలు ముందు మాటలో ఇలారాశారు:

'మహాభారతం' మానవ సంస్కృతి చరిత్ర అధ్యయనానికి తరగని నిధి. విజ్ఞాన సర్వస్వపు విలువ గలిగిన కవిత్వం యిది. దీనిలో ప్రాచీన భారతదేశ పౌరాణిక, మత, నైతిక విషయాలు, సామాజిక, ఆర్థిక భావాలకు చెందిన పుష్కలమైన సమాచారం ఉంది."

"మహాభారతం" తాలూకు మరో విభాగమైన "కర్ణపర్వాన్ని" 1989 ప్రణాళికలో, **పాశ్చాత్యానికి విస్మృతోస్తి పోస్తొకా** పుస్తక పరంపర అంతర్భాగంగా చేర్చామని నౌకా ప్రచురణ సంస్థ ప్రధాన సంపాదకుడైన ఓ.కె.డ్రెయర్ గారు చెప్పారు. ప్రాచ్య ప్రాచీన సాహిత్యంలో శ్రద్ధ గలవారికి యిది ఆసక్తిదాయకంగా ఉంటుంది.

# ఆదిమ మానవుడు ఏ ప్రాంతంలో నివసించాడు?

ఆదిమ మానవుడు యే ప్రాంతంలో నివసించాడు? "ఆఫ్రికాలో" అని సాధారణ అభిప్రాయం. కాదు "ఉత్తర యూరేషియా" అని యాకూతియా పురావస్తు శాస్త్రవేత్త యూరి మొఛానవ్ అంటున్నారు.

యాకూత్‌స్క్ నగరానికి ఎగువన 140 కిలో మీటర్ల దూరంలోని డిరింగ్ - యుర్‌యాక్ ప్రాంతంలో లీనానది ఒడ్డున ఒక రోజు భూగర్భ శాస్త్రవేత్తలు ఖనిజాల అన్వేణకోసం జరిపిన తవ్వకాల్లో మానవ కపాల భాగమొకటి లభించింది. యీ విషయం తెలిసిన పురావస్తు శాస్త్రవేత్తలు అక్కడ తవ్వకాలు ప్రారంభించారు.



### డిరింగ్-యురియాక్‌లో తవ్వకాలు

ఈ విధంగా జరిపిన మొదటి తవ్వకాల్లో కొత్తరాతియుగంనాటి రాతి శవపేటికలు లభించాయి. వాటిలో దైనందిన జీవితావసరాలకు వినియోగించిన పరికరాలు వున్నాయి. వాయవ్య ఆసియాలో యిలాంటి స్మశానవాటికలను మునుపెన్నడూ కనుగొనలేదు. యివి 35000 యేళ్ల నాటివని నిర్ధారించారు. యిది యెంతో విలువైన సమాచారం.

వీటిలో ఒక స్మశానవాటికలో గులకరాళ్లపార కనిపించింది. ఆ పారలో క్వార్ట్జ్ పరికరాలున్నాయి. యీ పరికరాల తయారీలో కనబర్చిన నైపుణ్యం అచ్చెరువు గొల్పుతోంది. తూర్పు ఆఫ్రికాలోని ప్రసిద్ధ ఓల్డువాన్ సంస్కృతిని యివి పోలివున్నాయి. తూర్పు ఆఫ్రికాలోని అత్యంత పురాతన మైన యీ స్మారకచిహ్నాలు 2,500,000 లేదా 1,700,000 యేళ్లనాటివి.

డిరింగ్ - యుర్‌యాక్‌లో యిప్పుడు తవ్వకాలు ముమ్మరంగా జరుగుతున్నాయి. బుల్‌డోజర్ల సహాయంతో. మానవ శ్రమతో 10,000 చదరపు మీటర్లలో 25,000 ఘనపు మీటర్ల మట్టిని తొలగించారు. యిక్కడ జరిపిన అనేక తవ్వకాల్లో చరిత్రపూర్వపు మానవుని పరికరాలు 2000 కుపైగా లభించాయి. యీ ప్రాంతంలో 50 మీటర్ల లోతుగల తొమ్మిది బావులు తవ్వారు. యిక్కడి భూపొరల మందాన్ని కనుగొనేందుకు పలురకాల భూభౌతిక పద్ధతులను, వినియోగించారు. యీ పొరల్లో పుప్పొడి రేణువులు, స్పోర్స్, నీటిమొక్కలు దొరికాయి. వీటిని యాకుత్‌స్క్‌లో, మాస్కోలో పరిశీలిస్తున్నారు. డిరింగ్-యుర్‌యాక్ ప్రాంతంలో ప్రాచీన కాలంనాటి మానవులు నివసించిన గుహలను కనుగొనేందుకు అధునాతన రాడార్ పరికరాన్ని వినియోగించారు. యీ పరికరాన్ని యాకూత్‌స్క్ విజ్ఞాన శాస్త్రవేత్తలు తయారుచేశారు. శిలలు దొర్లి చాలా లోతున కప్పుకపోయిన ఒకపెద్ద గుహను తెరిచేందుకు తవ్వకాలు జరుపనున్నారు.

పురా శాస్త్రవేత్తలే కాక అన్ని రంగాలకు చెందిన శాస్త్రజ్ఞులు డిరింగ్-యుర్‌యాక్ రహస్యాలను ఛేదించడానికి కృషి సల్పుతూ యిప్పటికే కొన్ని నిర్ధారణలు చేశారు.

ఈ మానవ ఆవాసం యేనాటిదో ఖచ్చితంగా చెప్పలేక పోతున్నారు. కాని యీ ప్రాంత పొరను కప్పివున్న ఒండ్రుమట్టి 1,800,000 యేళ్లనాటిదని అంచనా. 2,500,000 లేదా 2,200,000 యేళ్ల కిత్రం మొత్తం ప్రపంచంలో ఉష్ణోగ్రత తీవ్రంగా పడిపోయినప్పుడు రూపుగొన్న పొరలు యివని సూచనలు తెలియజేస్తున్నాయి. అందువల్ల యిక్కడ ఆదిమ మానవుడు 2,500,000 లేదా 1,800,000 యేళ్లక్రితం నివసించాడని మనం చెప్పవచ్చు.

ప్రాచీన డిరింగ్ ప్రజలు జీవించిన కాలంనాటి ఉష్ణోగ్రతకూ, ఆ ప్రాంతంలోని యీనాటి ఉష్ణోగ్రతకూ తేడా ఏమీ లేదనీ, అంటే యీ ప్రాంతంలో అప్పుడూ యిప్పుడూ మైనస్ 10.2 డిగ్రీల సెంటీగ్రేడ్ వుష్ణోగ్రతే వుందని యిక్కడి మట్టి పొరలను పరిశీలించిన శాస్త్రజ్ఞులు తెలియజేశారు. ఇంతటి తీవ్ర వాతావరణ పరిస్థితిలో ప్రాచీన మానవుడు మనుగడ సాగించాడంటే అతడు దుస్తులు ధరించడం, నిప్పుచేయడం, యిండ్లు కట్టుకోవడం, వేటాడడం నేర్చివుండాలి. దీనర్థం మంచివాతావరణ పరిస్థితుల్లో జీవించిన తమ ఆఫ్రికన్ సమకాలీనులకన్నా యీ ప్రాంత ప్రజలు బాగా అభివృద్ధి చెంది వుండవచ్చు.

మనపూర్వీకులు సమస్త వనరులు సమకూర్చుకుని త్వరగా అభివృద్ధి చెందడానికి చలి ప్రేరేపించింది. అలాంటి తీవ్ర వాతావరణ పరిస్థితులు మానవాభివృద్ధిలో గుణాత్మకలంమనకు — మేధావి పుట్టుకకు — దారి తీసింది.

ప్రాచీన మానవుడు నివసించిన ప్రాంతంగురించిన సాంప్రదాయక భావాలను యీ పరికల్పన ప్రకారం సరిచేయాల్సి వుంటుంది. గతంలో అంటే 10,000,000 యేళ్ల క్రితం వుష్ణోగ్రత తగ్గుదల తీవ్రంగా అనుభూతమైన మండలాల్లోని చాలాయెత్తయిన ప్రాంతాల్లో ప్రాచీన మానవుడు నివసించి వుండవచ్చు. దీని ప్రకారం అన్నిటికన్నా ముఖ్యంగా ప్రాచీన మానవుని నివాసం తక్కువ ఎత్తుగల మధ్య సైబీరియా పీఠభూమి (డిరింగ్-యుర్‌యాక్) అని పేర్కొనవచ్చు.



విక్టర్ కొక్లియూషిన్

నేనో ముఖ్య విషయిం చెప్పదలచుకున్నాను. అదేమంటే: పునర్ వ్యవస్థీకరణ వుద్యమానికి తూట్లు పొడవడానికి కంకణం కట్టుకున్నాను.

నన్ను నేను యెందుకు పునర్ వ్యవస్థీకరించుకోవాలి?

తాగొద్దంటున్నారు. వోడ్కాయెన్నడూ తాగని నాకు యెందుకు ఆనీతి బోధ? గుక్కెడు తాగితే తల గిర్రున తిరుగుతుందే!

నేను పనికి యెన్నడూ ఆలస్యంగా వెళ్లలేదు. మరోవిధంగా చెప్పాలంటే యింటికి తిరిగి రావడమంటేనే నాకు యిబ్బంది కరంగా వుటుంది.

నా భార్యను నేను యెన్నడూ మోసగించలేదు. నాకు పెళ్లి అయినప్పటి నుండీ, ఆడవాళ్లు అంటేనే చచ్చేభయం అందమైన అమ్మాయి నన్ను చూసి ఒక నవ్వు విసిరిందంటే, నా వెన్నుపూసలుకూడా కంపిస్తాయి. మరోపెళ్లా, ఆ ఖర్చు తలుచుకుంటేనే ప్రేమచల్లబడిపోతుంది.

నాకు "అనార్జితాదాయాలు" లేవు. నన్ను క్రమశిక్షణలోపెట్టడానికి పోలీసును పిలుస్తానని మాముత్తవ్వ ఎప్పుడూ బెదిరించేది. పోలిసు కనిపిస్తే చాలు గుర్తింపుకార్డు కోసం జేబులు తడుముకోవడం నా అలవాటు. నాకు అధిక ఆదాయమంటూ యెప్పుడూలేదు.

నేను నదులను మరిదేన్నికూడా యెన్నడూ కలుషితం చేయలేదు. వాటి ప్రవాహాన్ని తలకిందులు చేయలేదు. "పార" అనే పదం వింటేనే నాచేతులు కంది పోతాయి. యిదినిజం.

విద్యుత్తును పొదుపు చేయండి, అవసరం లేనపుడు లైట్లను ఆర్పివేయండి అని పెలివిజన్‌లో చేసిన విజ్ఞప్తిని అక్షరాలా పాటిస్తున్నాను. విధేయుడనైన పౌరుణ్ణి అని గర్విస్తున్నాను.

యూనియన్ సమావేశాల్లో మా మానేజర్‌ను విమర్శించి ఎరుగను. అసలు ఆయన యెలాంటివాడో తెలియదు విమర్శించడానికి. వేదికపై కూర్చున్న పెద్దోళ్ళను చూడడానికి ముందువరుసలో నాకు సీటు యెన్నడూ లభించలేదు. హాలులో వెనుక సీటులో వున్న నేనేం మాట్లాడాలి. ప్రసంగాలవల్ల ప్రయోజనం యేమాత్రంలేదు. అవి మామూలు పాతపాటలే. లోగడ ఆకాశానికెత్తారు, యిప్పుడేమో విమర్శలు కురిపిస్తున్నారు. ఒక వక్తను మెచ్చుకోవాలో, లేక అయన రాజీనామాను డిమాండ్ చేయాలో వుపన్యాస సరళిని బట్టి మనం నిర్ణయించలేము.

నేను లంచాలు తీసుకోను. అయితే యిచ్చేవాళ్లుంటే పుచ్చుకోనని గట్టిగా చెప్పలేను. కట్టలకొద్దీ కరెన్సీ నోట్లను యెవరైనా యిస్తే వాటిని వాళ్ల ముఖంమీదే కొట్టి ఆనందించాలని వుంది. ఆ నోట్లన్నీ నా ఆఫీసులో ఎగురుతూ వుంటే అందరూ చూసి నా నిజాయితీని పొగడాలని వుంది. కాని నాకు ఆఫీసంటూలేదు.

నాకు చెడ్డ అలవాట్లు లేవు. నేను అల్పాహారం, మధ్యాహ్న భోజనం, రాత్రి భోజనం అన్నీ ఒకేసారి చేయగల సమర్థుణ్ణి.

నేను సరిదిద్దగల లోపాలను, ఘోరాలను అన్నిటినీ నేను చూడదలుచుకోలేదు, కాబట్టే నేను గంతలు కట్టుకున్నాను. టి.వి. ని

కూడా నేను అర్ధనిమీలిత నేత్రాలతో చూస్తాను. ఆ తర్వాత హాయిగా నిద్రపోతాను.

నేను చేసే పనికీ, నా ఆలోచనకూ సంబంధమే వుండదు. సాంకేతిక సూచీలను గురించి చెప్పడం నాపని. అయితే అదే సమయంలో మరునటిరోజు చెల్లించాల్సిన టెలిఫోన్ బిల్లు గుర్తుకు వస్తుంది. సకాలంలో బిల్లు చెల్లించకపోతే ఫోన్ కట్ చేస్తారు, మిగతా ప్రపంచంతో నేను వేరుపడిపోతాను. అది తలుచుకుంటూనే సాంకేతిక సూచీల గురించి చెప్తాను. అంటే నేను ఆలోచించేదొకటి, చెప్పేదొకటన్న మాట. అలాంటిదీ నా జీవితం నేను బతికున్నా లేనట్లుగా!

చిత్ర రచన: వి. వల్నబోయ్

---

ప్రత్యేక సమాచారం

అణ్వాస్త్ర రహిత ప్రపంచం దిశగా తొలి అంజ

1987 డిసెంబరు 8న వాషింగ్టన్‌లో సోవియట్-అమెరికన్ ఐ.ఎన్.ఎఫ్. సంధిపై సంతకం జరిగినపుడే స్వల్పశ్రేణి, మధ్యశ్రేణి మిసిలీల భవితవ్యం నిర్ణయమైంది. మొదట వీటిలో నాలుగు శాతం మిసిలీలను నిర్మూలిస్తారు. అణ్వాస్త్రరహిత ప్రపంచ నిర్మాణం దిశగా యిది తొలి అంజ అవుతుంది.

కజక్ గ్రామం అయిన సరీజోతెక్ సమీపంలోని పరీక్షా కేంద్రంలో స్వల్పశ్రేణి మిసిలీ నిర్మూలనను ఫొటోలో చూడవచ్చు.

పైన: యీ నిర్మూలనా క్రమాన్ని తిలకిస్తున్న సోవియట్, విదేశీ పాత్రికేయులు.

ఏడు వశాబ్దాల సోవియట్ పెయింటింగ్స్

రుసుదాన్ పెత్వియాష్విలా (20) తిబ్లిసీ ఆర్ట్ అకాడమీలో మూడవసంవత్సర విద్యార్థిని. ఆమె ఆరవయేటనే తన మొట్టమొదటి ప్రదర్శనను నిర్వహించింది. అది నిజంగానె ఒక సంచలనం కలిగించింది. "ఈ బాలిక అద్భుత యోచనా శక్తి, ప్రకృత్యతీతమైన శక్తులను పెన్సిల్‌తో చిత్రించడంలో ఆమెకు సహజంగా గల శక్తి, భావగర్భితమైన ఆమె పెయింటింగులు నన్నెంతో ప్రభావితం చేశాయి" అని అన్నారు ఇటాలియన్ పెయింటర్ రెనాటో గుత్తుసో



టూకీగా



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | **KRSA102M279** |
| పుస్తకం పేరు | సోవియట్ సమీక్ష |
| తారీఖు | **23 February 2025** |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | mary |
| పేజీలు విడదీసినది | mary |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |